విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాడి గౌతమరావు

# జయంతి

సంపుటి 2 సంచిక 8 జూలై '60



20

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాస పత్రిక :

## 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై
విశేష చర్చలు....

కార్యాలయము :
౫౧౭, సుల్తాన్‌బజార్
హైదరాబాద్ (ఆం. ప్ర.)



## PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.

**R. C. No. 973 M 4/58.** **Dated 8-6-59.**

**The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and Public Libraries in the State.**

**Name: JAYANTI**

**K. RAGHAVA REDDY,**
***For Director of Public Instruction.***

"జయంతి" రైల్వేస్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

2-7-60

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః

సంపాదకులు
విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాడి గౌతమరావు

# జయంతి

# 20




సంపుటి-2. సంచిక-8. జూలై '60

కార్యాలయము
ఉస్మాన్‌పురా, కరీంనగరము

సంవత్సర చందా రు. 8.
విడిప్రతి న. పై. 75.

# సంపాదకీయము

ఏక లిపివాదము- ఈ వాదము నేడు సర్వముఖముల పెద్దలచేత తిరిగి తిరిగి చేయబడుచు తత్సాధనముకొరకు రాచరికమువారిచేత నెంతయో ధనము వ్యయ పెట్టబడుచున్న విసయము దీనికి మూలము సర్వజగత్తునందు సర్వజనులయందు సర్వదేశవాసులయందు సర్వజాతులయందు విరోధము లేకుండ స్నేహము కలిగి వర్తించవలయునన్న యొక సిద్ధాంతము. భూలోకము స్వర్గలోకముగా జేయవలయునన్న మానవుని యొక మధురమైన యాశ. ఆ యాశాభావమునుండి యనేకములైన చిన్నిచిన్ని యూహలు పుట్టును. వానిలో నిది యొకటి. తొలుత నా యాశ యెట్టిదో విచారించినచో దాని పిల్లయైన దీని యొక్క సంగతత్వమును తెలియును కాని బహుజనులు నేటి కాలమునందు యథార్థ చర్చ కనుకూలురుగా గనిపించుట లేదు. ప్రవాహపతితములైన భావములయందు నావేశముపొంది వర్తించుటయే కాని శాంతమనస్కులై విచారణ చేయునట్లు కనిపించదు. అట్లు చేయకుండుటకు రెండభ్యంతరములున్నవి. ఒకటి అధికారము చేతిలోనుండుట, రెండవది మంది బలముండుట. ఈ రెండును మనుజుని సదూహమార్గమున బోనీయవు. కాలము తీవ్రవేగముతో బ్రవర్తించు జనులయొక్క సంఖ్యను వృద్ధిపరచుచున్న కాలము. కాలమిట్టిదని చెప్పుటలోని యర్థమేమనగా మానవ నాగరకతయు విద్యాబుద్ధులును తదనుకూలములైనవని యర్థము. పూర్వకాలమున ప్రాక్పశ్చిమ దేశములయందు విద్యానాగరకతల యొక్క స్వరూపము తర్కము మీద నాధారపడియుండెడిది. పశ్చిమ దేశములయందు నాగరకత నొక వైపునకు కొనదేరి ప్రకృతిశాస్త్ర పరిశోధనగా బరిణమించినది. ఈ పరిశోధన గణితశాస్త్రము మీద నాధారపడియున్నది. తర్కముకంటె గణితము ఫలితాంశమున నిశ్చయాధిక్యముకలది యన్న భావముచేతను రెండును రెండు కలిపినచో నాల్గు నిస్సందేహముగా నగుటవలన గణితశాస్త్రమున కాధిక్యము వచ్చినది. రెండును రెండు నాల్గగుట పరమవివేకియెడల నెంతో పరమమూర్ఖునియందు నంతే. అచటవ్యభిచారము లేదు. తర్కమునం దట్లు కాక యవయవములనుండి యనుమానము తెచ్చుటలో బహుజనులబుద్ధి బహుధావ్యభిచరించుటచేత గణితమునకీ యాధిక్యము వచ్చినది. పక్షము, వ్యాప్తి మొదలైనవానియందలి వ్యభిచారము గ్రహించుటకు మేధానునిశితత్వము కావలయును. గణితశాస్త్రమునందుకూడ మహావిషయములను పరిగణించునప్పుడవ్యభిచారముయొక్క యవసరము లేకపోలేదు కాని తర్కశాస్త్రము మొదటినుండియు సవ్యభిచారక్లిష్టమైయుండగా గణితము వృద్ధదశయందు సవ్యభిచారముకావచ్చును.

ఈ రెండు శాస్త్రములలో నధిక దశయందు గణితము సర్వజనులయొక్క యాలోచనల కందనిదై శాస్త్రవేత్తలకు మాత్రమే తెలిసినదై సామాన్యుని దానివంక చూచుటకు గూడా వీలులేని గహనమైన విషయమై లోకోపకారకములైన తత్ఫలితములు మాత్రము సర్వజనులకు సేవ్యము లట్లు కన్పించుచు అపరిజ్ఞాతమార్గమైనను ఫలితములయందున్న యాశచేత మానవులకు తన యాధిక్యము ఋజువుపరచుచున్నది. తర్కముయొక్క స్థితి యిట్టిదికాదు. ఇందును సామాన్యులకు తెలిసిన తర్కము విశేషజ్ఞులకు తెలిసిన తర్కము రెండును రెండుగా గలవు. గణితమునందు నీ రెండు భేదములుకలవు. చంద్ర మండలమునకు రాకెట్టును పంపించుటకుగావలసిన గణితము సామాన్యుల కవగతముకానేకాదు. మహర్షికల్పుడైన ఐన్‌స్టయిను తన రిలేటివిటీ సిద్ధాంతమును ప్రపంచకమునందలి మహాప్రకృతి శాస్త్రవేత్తల సభలో నుపన్యసించినప్పుడు దాని నర్థముచేసికొన్న వారిద్దరో ముగ్గురో యున్నారని చెప్పికొనుచుందురు. ఆయన సిద్ధాంతమును కాదనుటకు వీలులేదు. ఎందుకనగా నా సిద్ధాంతము దేనిఫలితము? గణితశాస్త్రముయొక్క ఫలితము. రెండును రెండునాల్గన్న విషయమెంత నిశ్చితమైన వ్యవహారమో యాయన ఫలితము నట్టిదే. తర్కమిట్టిదికాదు. ఇందును సామాన్యులకు దెలియు తర్కము విశేషజ్ఞులు మాత్రమే తెలిసికొగల తర్కము వేరైనను దాని నందరంగీకరించరు. సామాన్యుడు తన తెలివి వంటిదే మహర్షుల తెలివియు ననుకొనును. ఇది యాధునిక నాగరకత యందు గల జగత్తునకు గలిపించుచున్న మోహమునకును మతిభ్రంశమునకును హేతువు. ఋషులు చెప్పినదేల నిజముకావలయును! నేను చెప్పినదేలనిజము కాకూడదు అని నేడు పలుమంది యనుచున్నారు. కాని ఐన్‌స్టయిన్ చెప్పినదియేల నిజము కావలయును నేను చెప్పినదేల కారాదు అని ఎవ్వరనరు. కారణ మీ రెండుశాస్త్రముల స్వరూపములోనున్న భేదమే.

ఇది యిట్లుండగా నేది తర్కముచేత నిరూపింపబడుచున్నదో అది గణిత శాస్త్రముచేత నిరూపింపబడిననే మేము విశ్వసింతుమన్న పద్ధతిలో నధునాతన నాగరకత సాగుచున్నది. సరే. అట్లన్న వారు గణితశాస్త్రముచేత నేది నిరూపింపబడలేదో దాని పొంతపోరాదు. మేము దానినే విశ్వసింతుమని బహు విషయములయందు సంచరించుచు తదితర విషయములయందు తర్కముచేత సాధింపదగిన విషయముల యందును తమ మంది బలముచేత, తమ యధికారముచేత వచ్చిన బలము నుపయోగించుచున్నారు, ఇది యాధునిక నాగరకతలోని సంఘర్షణ స్థానము.

సర్వ జనులయొక్క వివేకము సమానమై యుండవలయుననుట గణితశాస్త్ర విషయములయందు కాదా? కాదు. కాదని విస్పష్టముగా తెలియుచున్నది. అచట నీజోక్త్యము పనికిరాదు. గణితశాస్త్ర విషయములో శాస్త్రజ్ఞాన మవసరము. తక్కినవానిలో

నూహయే పాలించుచున్నది. ఆ యూహకు దారిలేదు, డొంకలేదు, ఏ విషయమును తీసికొన్నను అది ద్విధాభూతమై కనిపించుచున్నది. అనగా దానినిగురించి యనుకూలముగా వాదించవచ్చును. దేనియందు తమకిష్టమో వానికి ననుకూలవాదనలే పట్టించి ప్రచారముచేయుటయు లోకమునందధికార బలముచేత బ్రవేశపెట్టుటయు జరుగుచున్నవి. అననుకూల వాదములను తిరస్కరించుటయు జరుగుచున్నది. ఇది యధికార బలముచేత చేయుచున్నారు కాని వాదనలయందలి భిన్నాంశములయొక్క సుపరిష్కారముచేత చేయుటలేదు. అవయవభూతములైన పక్షవ్యాప్తుల సవ్యభిచారత్వమువంక దృష్టి పోనిచ్చుటలేదు. ఇపుడు ఏకలిపి విషయము చూతము. పాశ్చాత్యుల తర్కమార్గము ననుసరించియే యొక యనుమానము నిర్ధారణచేయునపుడు తత్సంబంధి బహ్వాంశములను తీసికొని వానిని పరామర్శించుట యున్నది. ఏకలిపి విషయమున పెద్ద సాక్ష్యమున్నది. యూరపు దేశములో బహు భాషలుకలవు. అన్నింటికొక్కటియేలిపి. ఈ లిపిలో కించిత్కించిద్భేదములు గలవు. ఆకారసామ్యముమాత్రమున్నది. ఆ లిపియందలి సమానత్వమేమనగా టైపుచేయుటకు వీలైన లక్షణము కలిగియుండుట. ఈ యాధునికమైన యంత్ర సాహాయ్యమునందలి సౌలభ్యమును మినహాయించినచో తదితరమైన యధిక గుణమేమికలదు అన్న ప్రశ్న. లిపి సామ్యముచేత పరభాషాగ్రంధమును చదివి తెలిసికొనుట యెన్నడును సాధ్యముకాదు. ఇది బహిరంగము, ఇది స్వల్పము అంతరంగమైనదధికము. ఎవ్వనికైనను లిపి తెలిసినంతమాత్రమున పరభాషాగ్రంథమును చదువలేడు. స్వభాషాగ్రంథమే చదువలేడు. ఒకటి, ఒక గ్రంథమును తొందరగా చదువుటకు చాల యభ్యాసము కావలయును. రెండు, శబ్దముల పరిజ్ఞానము కావలయును. వాక్యవిన్యాసవైఖరీ విశేష పరిజ్ఞానము కావలయును. స్వభాషలోకూడ గొన్నిశబ్దములు తెలియును కొన్ని తెలియవు. తెలిసిన శబ్దములను గుర్తుపట్టుటచేత పరిశేషన్యాయమున తెలియని శబ్దములు ఇవియని గుర్తుపట్టబడును. కనుక గ్రంథము చదువుటకు తద్భాషాపరిజ్ఞానమే యవసరము. తద్భాషాగత బహుశబ్దస్వరూపజ్ఞాన మవసరము. వాక్యవిన్యాసము తెలిసికొనుట యవసరము. లిపియొక్క యవసరము చాల కొంచెము. భాషాపరిజ్ఞానము కొండంతది, లిపి జ్ఞానము చీమంతది. ఈ చీమంతదానికి ప్రాధాన్యమిచ్చుట యేమి న్యాయము?

ఇట్లుండగా ఔనయ్యా! ఆ కొండంతశ్రమను నెప్పుడు తప్పదు. ఈచీమంతశ్రమను తొలగింతుమందురేని ఈ చీమంతశ్రమను తొలగించుటలో దానినాచరణకు తెచ్చుటలో వందచీమలంత శ్రమను కలిగించుచున్నారు. తెలుగుదేశమున నొకనికి, నొకనికేకాదు, పలుమందికి సంస్కృత భాషాజ్ఞానము సమృద్ధిగానుండును. వారికి నాగరిలిపి చదువుట

కష్టము. తెలుగులోనడచినంత ధారాళముగా వారికి నాగరిలిపిలోని సంస్కృత గ్రంథములు నడువవు. ఇట్టిబాధ సర్వభారతదేశ భాషలకు సమానముగా రోమన్‌లిపి పెట్టినపుడు ప్రచండముగా జరుగును. ఇది యభ్యాసముచేత వచ్చినబాధ. పసితనము నుండియు రోమన్‌లిపినే నేర్చినచో నొకపాతికయేండ్లలో ముప్పదియేండ్లలో నరువదియేండ్లలో జాతికే బాధ తగ్గిపోవును. వారికేబాధయుండదు అని వాదించవచ్చును. సరే ఈ యరువదియేండ్లలో భిన్నభిన్నమైన చదువరితనములు కలవారుందురు. ఉపాధ్యాయులకే ఈ బాధయుండును అచ్చునకు నీవెన్ని విధములుగా గుర్తులు పెట్టినను గుర్తులు గుర్తులుగానేయుండి చదువుటసాగదు. జర్మన్ భాషలో "ఎ" అన్న యక్షరమునకు నైదారుగుర్తులతో నైదారుచ్చారణలుకలవు. ఇట్టిదొలుత నొకభాషయొక్క యుచ్చారణ కష్టమైనది. ఆ యుచ్చారణలోనిసొంపు తద్భాషాదేశస్థులకే తెలియును. భారతీయులింగ్లీషు మాటాడుచుండగా నాంగ్లేయులు పరిహసింతురు. అంతదాక నెందులకు? నేడు హిందీ బహుధా ప్రచలితమై ఔత్తరాహులు మాటాడుచుండగా హిందీ చదివిన యాంధ్రులలో నెంతమందికో తెలియదు. ఇంగ్లీషు బాగుగా వచ్చినవారే కొన్ని యింగ్లీషు సినిమాలకు వెళ్ళినచో వారేమి మాట్లాడుచున్నారో తెలియదు. హిందీలోనున్న కొన్ని పారసీ అరబ్ శబ్దముల యొక్క యుచ్చారణ తదితరులకురాదు. జధేసరతోస్– ఇది మహారాష్ట్రము. దీని మహారాష్ట్రుడనెడి పద్ధతిగా నాంధ్రుడనలేడు. ఆంధ్రుడు దీని సన్నప్పుడు మహారాష్ట్రునకు తెలియదు. స్థూలముగా భాష రెండు విధములు. వ్రాయబడియున్నది, మాటాడునది. వ్రాసినది వ్రాసినట్లుగా చదువబడు లక్షణముకల భాషలు స్వల్పము. అచ్చటే బహుజాతులవారు బహు విధములుగా నుచ్చరింతురు. ఇంత మహా కష్టమైన సమస్యలో బహు స్వల్పవిషయమైన యొక లిపి సాధించెడి లాభమేమి? ఇంకొక క్లేశమును సమకూర్చి పెట్టుట మాత్రమే. దాని లాభము నేడు వ్యవహార దశయందు టైపురైటరు వలన కలిగెడిది కావచ్చును.

పాశ్చాత్యులు తమ లిపి కనుకూలమైన ఈ యంత్రమును నిర్మించికొనిరి. మన దేశములందున్న ప్రకృతిశాస్త్ర రహస్యాభిమానులు, పరిశోధకులు, వివేకులు, మన భాషా లిపుల కనుకూలములైన యంత్రములను కనిపెట్టవచ్చును. దానికి ప్రోత్సాహమిచ్చి యట్టి యంత్రములను నిర్మాణము చేయించికొన్నచో సులభమగును. దానికి ప్రోత్సాహ మీయవలయును.

చర్ఖా యున్నది. మహాత్ముడిచ్చిన ప్రోత్సాహమువలన క్రొత్త క్రొత్త చర్ఖాలు కనిపెట్టబడినవి. అట్లే యిచ్చటను చేయవలయును. నేడు బహు విషయముల యందు సంస్కరణలుచేయ నెంచుటయే కాని తదనుకూల మనః ప్రవృత్తి కలిగించుటయందు శ్రద్ధ కనిపించుటలేదు. ప్రాజెక్టులు కట్టుచున్నారు, క్రొత్తభూమి సాగు

క్రిందికి తెచ్చుటకు ప్రయత్నము చేయుచున్నారు. జనులయొక్క మనస్సులు నిత్యము నుద్యోగము చేయుటకే యభిముఖముగా నున్నవి. నేల దున్నుట కభిముఖముగా లేదు. ఆ యాభిముఖ్యమును తొలుత కలిగించవలయును. అట్లే స్వభాషాక్షరములను సులభముగా వ్రాయుటకు వీలైన యంత్రములను కనిపెట్టెదు ప్రోత్సాహ మిచ్చినచో నిది సులభముగా పరిష్కరింప బడెడి వ్యవహారము. ఒక్కసంగతి చూడవలయును. మనకు పాశ్చాత్య నాగరకతయం దభిమానము కలదు. వారు నిర్మించికొన్న యంత్రముల ప్రకారము మన నాగరకతను మలచుకొనుటయా, మన నాగరకత ప్రకారము మన కనుకూలమైన యంత్రములను మనము కనిపెట్టుటయా? ఇది ప్రధానమైన యంశము. వాడొక కోటు తొడిగికొన్నాడు. ఆ కోటు నంగడిలో నమ్ముచున్నాడు. అది మనకు సరిపోలేదు. బిగువైనది. మన ముపవాసములు చేసి శరీరము నెండబెట్టుకొని యా కోటును సరిపుచ్చుకొనుటయా? అంతకంటె మన మా గుడ్డ నిక్కడ ఉత్పత్తి చేయలేనిచో కనీసము గుడ్డ నచ్చట కొని తెచ్చికొని మనకు తగినట్లు కుట్టించుకొనుటయైన చేయవలయును.

ఇంతకంటె మహాధికమైన దోష మింకొకటి కలదు. దాని పేరు కాలము. అది యెట్లు మారునో మనకు తెలియదు, ఇప్పటి కిట్లు మారినదికదా! మనకు పాశ్చాత్య సంపర్కము కలిగిన తరువాత ఫ్రెంచి భాష యంతర్జాతీయ భాషగా నుండుటపోయి నే డింగ్లీషు భాషకా యోగము పట్టినది. రష్యనులతో నమెరికనులు మారణాయుధ నిర్మాణముల యందు నుద్దేలుగా ప్రవర్తించుటచేత నద్యతన భవిష్యత్తులో రష్యనుభాష యంతర్జాతీయ భాషయగు లక్షణము పోయినది. రేపేది వచ్చునో, చీనావారి భాష వచ్చునేమో. ఇది కాలములోనున్న మార్పు. మనకు తెలియదు. ఇట్టి సందర్భములో నేక లిపిని సాధించి దాని నాచరణపెట్టు వేళకు నెన్నో సంవత్సరములు గడచును. అప్పటికి రాజ్య వ్యవహర్తల మనస్సులలో నే పురుగులు పుట్టునో!

రాజ్యముచేయుట యనగా నందరు కూడు గుడ్డలు కలిగి యుండునట్లు చూచుట. ఒక సంఘమునకు ప్రాధాన్యము నొక సంఘమున కప్రాధాన్యము లేకుండ చేయుట, అధికారమునందున్నవారు తమ భావములను నితరుల నెత్తిమీద రుద్దకుండ నుండుట, రోగ నివారణము (ఈ యొక్క విషయమునందే యాధునిక నాగరకత ప్రశంసింపదగియున్నది. దీనియందు దనవంతునకే యెక్కువ సాహాయ్యము కలుగగలిగి యుండుట యొక యల్పమైనదోషము.) మొదలైన వానిని సాధించుట రాజ్యముచేయుట. కాని భాషా విషయిక సాంఘిక విషయక మత విషయిక పరిస్థితులయందు మన కేప్పుడధికార మున్నదని విశ్వసించుచు ప్రజల యభిప్రాయములను నిర్బంధాచరణమునందు బెట్టి మానవులకు శాంతి లేకుండజేయుట రాజ్యము చేసెడు లక్షణము కాదు.

# ఒకడు నాచన సోమన్న -4

విశ్వనాథ సత్యనారాయణ

ఇంతవరకు వ్రాయబడిన నరకాసుర వృత్తాంతము మహాకాశ గోళమున చెదరింపబడిన యొక పెద్ద మట్టిముద్దగా వర్ణింపబడుట మద్బుద్ధి విలసనమే కాని తత్కథయందు దాని స్పష్ట నిదర్శనములు లేవని యొక రిద్దరు మిత్రులు మందలించిరి. అది యట్లు. పూర్వకథిత విషయములయందే దాని స్వరూప మట్లే యుండునని వ్రాయబడినది. గరుడుని కథలో నది వేదచ్ఛందోఽవతారమని కాని మహాయజ్ఞముల యందలి మహాగ్ని కుండాకారమని గాని కథచేత భాసించదు. కథలలో నా సూచన కూడ లేదు. కాని యా సంగతి వేదమునందలి కొన్ని యజుస్సులచేత కల్ప సూత్రము లందలి కొన్ని యర్థములచేత ననుమీయమానమగు కథ. అంతకంటె నీ నరకాసుర వధ భిన్నాంశముల పంయోజనముచేత నధికముగా గ్రాహ్యము కాదగినది. ఇందులో వరాహాకృతియైన విష్ణువు ప్రళయ కాలమునందు ధాత్రిని లేవనెత్తిన నాటి వరాహభూదేవీ సంగమ జన్ముడు నరకుడని చెప్పబడుట యొకటి. యా నరకుని ద్వాపరాంతమున హరి హరియించుట యనునది యొకటి. నరకుడు చతుర్దశి యను కన్యను ప్రజాపతి కన్యను పెండ్లాడెనని చెప్పబడి చతుర్దశినాడే నరక చతుర్దశిగా నైదువేల యరువది యేండ్లనుండి భారతీయులు పండుగ పాటించుట యొకటి. ఈ మూడంశములయొక్క కూడికచేత నీ కథలోని ఖగోళగత మహావిషయమన్నది యనుమీయమాన మగుచున్నది. లేనిచో పొసగుదలలేదు. దీని వెనుక వైదికములు జ్యోతిషములునైన మహావిషయములు కథలుగా పురాణములయందు జెప్పబడెనన్న విషయము కలదు. దానిని పురస్కరించుకొని యిట్టి వ్యాఖ్యానము చేయబడినది. ఈ వ్యాఖ్యానము సేయుట వృథాగా చేయబడలేదు. ఉత్తర హరివంశము విష్ణుపారమ్య బోధక గ్రంథముగా సోమన్న భావించుట యితర కథలచేత నూహింపబడుచున్నది. కావున నీ మొదటి కథ కీ యర్థము పొసగించినగాని తక్కిన కథలతో నిదికూడ విష్ణువు యొక్క సర్వజగదధినాయకత్వ నిర్ణాయకత్వము కలిమి పొసగదు కాన కల్పన సముచితముగా నదియట్లు వ్యాఖ్యాత మైనది.

ఇట్లు ప్రథమ కథయందు సర్వ వియన్మండలము నందలి సర్వగోళములయొక్క నియమిత చంక్రమణమునకు నధికారి శ్రీకృష్ణదేవుడని నిరూపించెడు కథ చెప్పి రెండవ కథను సోమన్న దేనిని తీసికొనెను? ఈ యఖండ బ్రహ్మాండ మండలమున మొదటి దాకాశము. దానియందున్న గోళములు, తత్పరిభ్రమణము. రెండవది యింతటి యగమ్యగోచరమైన విషయము ఇదమిత్థమని నిర్ణయింపరాని దేదియనగా జనన మరణములు. ఇందు జననమును గూర్చిన ప్రసక్తి లేదు. ఎట్లు వచ్చితిమని యెవడో యోగి తప్ప తక్కినవాడు విచారించడు. అయ్యో! చచ్చిపోవుచున్నామని ప్రతివాడును విచారించెడివాడే. మరణము మీద నెవని కధికారము కలదో జననము మీద వానికే యధికారము కలదు. ఎవడు భగవంతుడో, ఎవడు జగదీశ్వరుడో, ఎవడు బ్రహ్మాండాధినేతయో, వానికి సర్వ వియన్మండల పరిభ్రమత్సర్వ గోళములయం దధికారముండ వలయును. కృష్ణున కది యున్నదని

ప్రథమ కథచేత నిరూపింపబడెను. అతనికున్న రెండవ యధికార మేది? జనన మరణముల మీద నతని కధికార ముండవలయును. అతడు భగవంతు డగుటకు రెండవ నిదర్శన మిది. ఈ యధికారము కూడ శ్రీకృష్ణున కున్నదని నిరూపించుటకు విప్రుని యొక్క మృత పుత్రుల శ్రీకృష్ణుడు బ్రతికించి తెచ్చెనన్న కథను సోమన్న వ్రాసెను.

అర్జునుడు ప్రయత్నించెను. విఫల ప్రయత్నుడయ్యెను. ఆనాడు భగవంతు దేకదిన దీక్షితుడు. ఆయన వెళ్లుటకు వీలులేదు. అర్జునుడు తానుపోయి యముని శిక్షించి వత్తునని యుబలాటపడెను. ఆమాట విని "విశ్వంభరుడల్ల నవ్వి" నరే పొమ్మనెను. కాని "రాముడును ప్రద్యుమ్నుండు దక్కన్" తక్కిన ద్వారకలోని యోధ వ్రాతమును కొనిపొమ్మనెను. బలరాముని ప్రద్యుమ్నుని నిషేధించెను. ఈ యిద్దరి నెందుకు నిషేధించెను— అర్జునుడు వెళ్లెను. ఎక్కడకు? ఆ బ్రాహ్మణుని భార్యయొక్క ప్రసూతి గృహమునకు. అయిపోయినది. అర్జునుడు తిరిగివచ్చెను. వచ్చిన యర్జునుని భగవంతుడు గారవించెను. బ్రాహ్మణుని బుజ్జగించెను.

చనిపోయిన యా బ్రాహ్మణుని పుత్రులను తెచ్చుటకు భగవంతుడు బ్రాహ్మణుని, పార్థుని వెంటగొని రథమెక్కి వెళ్లెను. ఎచ్చటికి వెళ్లెను? ఇచ్చటకు వెళ్లవలయునని తెలియదుగదా? అర్జును డనగా ప్రసూతి గృహమునకు వెళ్లెను. కృష్ణు డెక్కడకు వెళ్లవలయును. చనిపోయినవా రెచట నుందురో అచటికి వెళ్లవలయును. వా రెచట నుందురు? ఎవడు చెప్పగలడు? అచటికి రథమెక్కి పోవుట యేమి? ఆ రథముమీద చివరిదాక వెళ్లిరా? వెళ్లలేదు. కొంతదూరము వెళ్లిన తరువాత పెద్ద చీకటి కనిపించినది. "మరియుం జీకటి కొండ చంద" మైనది. అర్జునున కది పాతాళము వలె నున్నది. కృష్ణు డా చీకటిని చక్రముతో నరకెను. అచట నొక పురుషుడు కనిపించెను. వాడిట్టిరూపము కలవాడని తెలియలేదు. కృష్ణు డర్జునుని విప్రుని నచ్చట నుంచి యా తేజములోబడి జనజొచ్చెను. చివరకు పుత్రులను దెచ్చెను. ఈ కథ. ఇందులో నింకొక చమత్కార మున్నది. వెళ్లునప్పుడు వీరి రథము రెండుజాములు నడచెను. తిరిగివచ్చునపుడు క్షణములో వచ్చిరి. ఈ కథ యిన్ని యద్భుతములతో కూడియున్నది. అర్జునున కర్థము తెలియలేదు. దీని యర్థమేమని భగవంతు నడిగినాడు భగవంతుడు దానికి సమాధానముగా "అక్షరత్రయరూపమై యఖిల యోగమూల మగు ప్రణవంబు నా మూర్తి సుమ్ము, నీకు జెప్పితి నత్యంత నియతమతికి దప్ప నీ మంత్ర మొరులకు తగదు తెలుప" —ఇది సమాధానము. జరిగిన పని యెంత యగమ్యమో సమాధానమంత యగమ్యము. ఏ పురుషుడు భగవంతుడు చీకటిని భేదింపగా గనిపించెనో ఆ రూపము జిన ప్రకృతియని కృష్ణుడు చెప్పినాడు. అందు చరాచర మున్నదన్నాడు. ఆ పురుషుడు అనగా తేజోమయుమైన యా రూపము, అనగా భగవంతుని ప్రకృతి కృష్ణ దర్శనార్థ మా బాలకులను మ్రింగెనట. అంధతమసము తాన, భేదకుడు తాన. సముద్రము తాన. స్తంభకారి తాన— ఈ స్తంభకారి వెనుక వెనుకటి కథ కలదు. కృష్ణ విప్రార్జునులు పోవుచుండగా సాగర మడ్డు వచ్చెను. కృష్ణుడు సముద్రమును త్రోవ యిమ్మనెను. సముద్రుడు "రథము చను నంత శోషింతు పథము కొను" మనెను. కృష్ణుడు అట్లు వలదు, రథముపోవునంత మేర నీటిని రారూపు చేయుమనెను. సముద్రు డట్లు చేసెను— ఈ పూర్వ కథకు సంబంధించినది సంస్తంభకారినేన అన్నమాట.

మృత విప్రకుమారుల కథ నట్లుంచి సాగర జల స్తంభనము విచారింతము. పూర్వము రామావ

తారమున భగవంతుడైన రాముడు సాగరము నెందుకు స్తంభింప జేయలేదు? ఇప్పుడెందుకు చేసెను? ఇతర మత గ్రంథములలో సముద్రుడు త్రోవయిచ్చుట కలదు. అది సముద్రుడు చేసిన పనియే. భగవంతు డడిగినది లేదు పెట్టినదిలేదు. భారత దేశమునుండి యనేక కథలు దేశాంతరము లకు పోయినవి. ఇచ్చట వైదిక మతమునుండి చెడినవారు పరదేశములకు బోయి యీ వాసనల తోడి కథలను కల్పించుకొన్నారు. దాని కిదియొక నిదర్శనము.

చీకటి. దానిని భగవంతుడు నరకుట దాని రహస్యము ప్రణవమగుట నీ మూడింటిలో నీ కథ యొక్క సర్వార్థ మున్నది. ప్రణవ "మఖిల మూల" మగుట. భగవంతుడు "అఖిల యోగ నిధి" యగుట. "జగన్నాథు డఖిల యోగనిధి జనా ర్దను డా తేజములోనం జన జొచ్చెన్"— సర్వ సమాధానములీ శబ్దములలో నున్నవి. ఈ సర్వ సృష్టియు నొక మహా యోగము. ఈ యోగము పరమేశ్వరునియొక్క ప్రకృతి. దానిని తెలిసికొను టకు ప్రణవోపాసన చేయవలయును. ఆ యుపా సన చేయుట కత్యంత నియతమతి కావలయును. అర్జును డత్యంత నియతమతి. అంతటి వాడును తన్మంత్రోపదేశమునకే యర్హుడుకాని శ్రీకృష్ణదేవుని వరె పోయి యంధకారమును భేదించుటకు సమర్థుడు కాడు. అనగా తద్విషయమును తెలిసికొనుట కర్హుడుకాని తత్కర్మాచరణమునకు సమర్థుడు కాడు. ఇది వైష్ణవ మతము. అద్వైతమైన నింతకంటె మంచి చేయలేదు. ఏలయనగా జీవుడు వ్యాపారా శ్రయుడు కనుక. భగవంతుడు ఫలాశ్రయుడు కనుక. ముక్తుడు బ్రహ్మ భావమును పొందునుగాని హిరణ్యగర్భుడు కాలేడు. సృష్ట్యాదియందు హిరణ్య గర్భుడు కలడు. అతడు కల్పములకు యుగము లకు నధికారి.

ఇట్లు సోమన్న సూక్ష్మమైన యీ విశిష్టాద్వైత మత రహస్యమును అద్వైత మతమునకు మిక్కిలి దగ్గరగానున్న దానిని చమత్కారముగా వ్యాఖ్యానము చేసెను. దీనిని గురించి యెంతో వ్రాయవలయును. అట్లు వ్రాసినచో నీ రెండు మతములయొక్క సిద్ధాం తములను పరామర్శింపవలసి యుండును. అది యిచ్చట ప్రసక్తముకాదు. మొదటి కథచేత వియ న్మండల పరిభ్రమత్సర్వ గోళాధిపత్యము శ్రీకృష్ణు నకు కలదని చెప్పి రెండవ యీ కథచేత జనన మరణముల మీద నధికారము శ్రీ కృష్ణునకే కలదని చెప్పినాడు. పరముడు శ్రీవిష్ణువు. ఆయనకే యీ శక్తులుండును. తక్కినవారి కుండవు. ఉండుట చేత నతడే పరముడు. ఈ రెంటికన్న మించిన పరమ శక్తులు సృష్టిలో నుండవు.

సాగర జలస్తంభమునుగూర్చి యొక్కమాట. దారి యీయలేదు. శోషింప చేయలేదు. ఉన్న దున్నట్లు "రథముపో జలము దిగిసె" ననుట దారి యిచ్చుటకు జలము శోషించుటకు రారూపగుటకు కించిద్భేదము కలదు. పూర్వ కర్మలయందు క్రియాలక్షణము కలదు. రెండవదానియందు లేదు. క్రియాలక్షణ మనగా కర్తృత్వాదికము సృష్టి వ్యవ హారము ద్యోతమానమగు స్థితి. రెండవది ప్రకృతి స్వరూపము. శ్రీకృష్ణుడు తానే సాగరము. తానే సంస్తంభకారినని చెప్పినాడు. ఇచట సంస్తంభకారి ననుట వ్యవహార కథనము వాగా పతితము కాక తప్పకపోవుట. సముద్రము రారూపైనట్లు పార్థు డనుకొనుట. పార్థునకు చెప్పుట. అది వట్టి సంకల్ప మాత్ర క్రియా పర్యవసానమైనది. త్రోవ యిచ్చుటయు రారూపగుటయు రెంటిలో కించిద్భేద మున్నది. త్రోవ యిచ్చుటలో సముద్రి డొకడు చేరయున్నాడు. వాడు మార్గమిచ్చెను. ఇచట సర్వము బరమేశ్వరుడే అన్న భావాధిక్యము గోచరిం చుట కిట్లు చేయబడినది. వారు వెళ్ళిరో లేదో తెలి యదు. వెళ్ళిరనుట మాయ. వెళ్ళినపు డన్నిదే

ములు తరించిరి. పర్వతములు దాటిరి. సముద్రములు గమించిరి. తిరిగివచ్చుట క్షణమాత్రములో నెట్లు జరిగినది? రెంటికి నెట్లు పొసగును. అంత ప్రయాణముచేసి చూచినది చీకటిని. తదంతర్వర్తి పురుషుని. ఆ పురుషుడు పరమేశ్వరుని ప్రకృతి. తత్ప్రకృతిని దర్శించుటకు తత్ప్రకృతిని తెలిసికొనుటకు బహు ప్రయత్నములు కావలయును. దేశములు దాటి పోవలయును. పర్వతములు భేదించవలయును. సముద్రములు తరించవలయును. అది యంత కష్టసాధ్యమైన పని. భగవత్స్వరూపావగతి కలిగినంతనే దాటవలసిన నదులు లేవు. గమింపవలసిన పర్వతములు లేవు. ఉత్తరింపవలసిన సముద్రములు లేవు. ఇది రహస్యము. అన్నియు నీవున్నచోటనే యున్నవి. అవి యున్న చోటనే నీవున్నావు. క్షణమాత్రమున నీ వింటికి వచ్చినట్లున్నది. క్షణమాత్రమున నర్జును డింటికి తిరిగివచ్చె ననుటలో జీవునియొక్క పునస్సంసార ప్రవేశము చెప్పబడుచున్నది. యోగ స్థితినుండి మేల్కొని సంసార భావన చేయుట క్షణమాత్రములో జరుగును. నిద్రకాని ఇంద్రియోపరతియైన యోగ సమాధి బహు ప్రయత్నముచేత సాధ్యమై తద్భ్రంశనము క్షణమాత్రములో జరుగును. ఇది యీ కథలో చెప్పబడినది. మన సర్వ కథ లిట్లే యుండును.

కొంచెము మిగిలినది. రామునకు కృష్ణునకు భేదమున్నది. రాముడు మాయామానుష విగ్రహుడు. కృష్ణుడు లీలామానుష విగ్రహుడు. అందుచేత రాముడు దారి వేడెను. ఇంకొక మార్గమున సాధించుకొనెను. కృష్ణుని విషయమున సాగరుడే వచ్చి యడిగెను. ఈయన దానిని పరామర్శించనేలేదు. రాముడు తన జన్మయందు "అఖిల యోగనిధి" యైన విష్ణువు తానని సార్వకాలిక పరిజ్ఞానము కలవాడు కాడు. అప్పుడప్పుడు తెలిసినవాడు. శ్రీకృష్ణుడు నిత్య తద్భావనావంతుడు. అందుచేతనే యీ విష్ణుపారమ్య బోధక కథా ప్రపంచము కృష్ణు నాశ్రయించి సోమన్న చేసినాడు. రామ కథల నాశ్రయించి చేయలేదు. ఇది అచ్చటికంటె యిచ్చట సులభమైన వ్యవహారము.

అంకితము:
శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
శ్రీ గుడిపాటి వెంకటచలం గార్లకు
— భక్తితో.

# దేవయాని

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి..

—భారతీయ సంస్కృతికి మూలధనము వంటివి భారత రామాయణములు. అవి మరల మరల వ్రాయబడు చున్నవి.

ఈనాడు వేదవ్యాస భారతము వ్యావహారిక భాషయందు శ్రీ రుక్మిణీనాథ శాస్త్రి గారు రచించుచున్నారు. వారి రచనలోని ఒక ఘట్టము ఇది—

శుక్రాచార్యులుగారు రాక్షసులకు గురువు. బృహస్పతిగారు దేవతలకు గురువు.

దేవతలకూ రాక్షసులకూ ఎప్పుడూ యుద్ధాలే గదూ. యుద్ధాలలో రాక్షసులూ చచ్చిపోయేవారు, దేవతలూ చచ్చిపోయేవారు. శుక్రాచార్యులు 'సంజీవని' అనే విద్యవల్ల చచ్చిపోయిన రాక్షసుల్ని తిరిగి బ్రతికించేవారు. ఈ విద్య శుక్రాచార్యులు గారికే తెలుసు, మరెవ్వరికీ తెలియదు. చచ్చిపోయిన రాక్షసులు గూడా మళ్లా మళ్లా బ్రతికేవారు. దేవతలతో యుద్ధాలు చేసేవారు.

దేవతలకు భీతి పుట్టింది.

బృహస్పతీ శుక్రుడూ సములు. ఒకరి విద్య ఒకరికి చెప్పరు. ఎట్లా?

బృహస్పతి కుమారుడు కచుణ్ణి చూచారు దేవతలు. కచుడు ఆ విద్య సాధించుకొని రావాలి.... కచుణ్ణి ప్రార్థించారు—

'బాబూ! నువ్వు బృహస్పతిగారి పెద్దకుమారుడివి. తండ్రిగారి అంత ప్రతిభాశాలివి. ధర్మపరుడివి. నీవు శుక్రాచార్య శిష్యత్వం ప్రారంభించాలి. సంజీవనీ విద్యను సాధించాలి'.

బృహస్పతి కూడా ఆలోచించారు.

"నాయనా! శుక్రుడు మహాముని. మహాప్రళయం సంభవించినా గూడా చెక్కు చెదరని మూర్తి. ప్రళయ జలాలు లోకాల్ని ముంచవచ్చు గానీ— శుక్రాచార్యుడి దగ్గరికయినా రాలేవు" అన్నాడు కొడుకుతో.

తన తండ్రి అంతవాడేగద. ప్రళయ జలాలు శుక్ర బృహస్పతు లిద్దరినీ ముంచలేవు. కచుడికి తెలుసు.

"శుక్రాచార్యుడు బహు సౌమ్యుడు. కానీ కూతురు దేవయాని ఎంతచెప్తే అంత. శుక్రాచార్యుడికి వినయ విధేయతలతో శుశ్రూష చెయ్యి. దేవయానిని అణకువతో సంతోషపెట్టు" అన్నారు మళ్లీ.

'అలాగే'.

"మరొక్కటి మాత్రం మరవకు. ఎవరి కోసం అయినా సరే, ధర్మాన్ని మాత్రం జవదాటకు. మన్ని ఎప్పటికయినా సరే, కాపాడేది, ధర్మం ఒక్కటే" అన్నారు బృహస్పతి.

కచుడు తండ్రిపాదాలకు నమస్కరించాడు. తండ్రి, దేవగురువు, మనసారా దీవించారు.

కచుడు శుక్రాచార్యులవారి దగ్గరికి పోయాడు.

"అభివాదనం చేస్తున్నాను, కచుణ్ణండీ!" అని మొక్కాడు. శుక్రుడు— "ఆయుష్మంతుడివై వృద్ధి పొందు కచా!" అని ప్లుతం ఉదాత్తంగా అన్నారు.

కచుడు తన గోత్ర ప్రవరలు చెప్పుకొన్నాడు. తిరిగీ నమస్కరించాడు. "విద్యాదానం చెయ్యండి, తమకు శిష్యుణ్ణి" అని చెప్పుకున్నాడు.

"నాయనా! బృహస్పతి కుమారుడివా! నిన్ను గౌరవిస్తే మీతండ్రి బృహస్పతిని గౌరవించినట్లే, నిన్ను సంతోషపెడితే మీ తండ్రిగారిని సంతోషపెట్టి నట్లే" అన్నారు శుక్రాచార్యులు.

"పెద్దవాళ్లకు కోపతాపాలు ఉండవు. ఎదుటి వారి శక్తి సామర్థ్యాలమీది గౌరవం తప్ప వేరే ఏమీ ఉండదన్నమాట" అనుకున్నాడు కచుడు.

కచుణ్ణి శిష్యుడిగా శుక్రుడు స్వీకరించాడు.

చేస్తాను. ఇదిగో, అనే మాట లేకుండా చెప్పిన పని వెంటనే చేసేవాడు కచుడు. గురువు గారి చిత్త వృత్తికి మహా అనుకూలుడై ఉండేవాడు. వినయ సంపద అంటే ఇతడేనా అన్నట్లుండేవాడు. మనస్సులో, చేతల్లో, మాటల్లో ఒకటిగా ఉండేవాడు. గురువుగారి మనస్సు కరిగేట్టుండేవాడు. గురువు గారి కుమార్తె దేవయానితో ప్రీతిగా మాట్లాడేవాడు. ఆమె అడిగితే పాడేవాడు. నృత్యం చేసేవాడు. సంగీత వాద్యాలు వాయించేవాడు. దేవయానిగూడా కచుణ్ణి అపేక్షగా చూచేది చాటుగా. తనంతతాను కచునిముందు పాడేది, ఆడేది.

కచుడు నియమ నిష్ఠలు కలవాడు. ధర్మ మార్గం తప్పనివాడు. గురు శుశ్రూష చేస్తున్నాడు.

రాక్షసులకు ఇదంతా కంటగింపుగా ఉంది. "ఇదంతా దేవతల మాయ" అనుకున్నారు. గురువు గారి దగ్గరికి పోయి చెప్పే సత్తువ వారిలో ఎవరికీ లేదు. గురువుగారి హోమధేనువులను కాచుకురావ డానికి అడవికి వెళ్లే కచుడిమీద ఉండేది వారి చూపు. కచుడంటే వారికి ఉన్న 'గుర్రు' కచుణ్ణి చంపుదాం అనిపించింది.

ఒకనాడు——

అడవిలో కచుడు శుక్రాచార్యులవారి హోమ ధేనువులను కాస్తున్నాడు. ఆవులు చెట్ల నీడల్ని ఆశ్రయించి తిన్నదాన్ని నెమరువేసుకుంటున్నయ్. కచుడు నోటికివచ్చిన వేదాన్ని వల్లించుకుంటున్నాడు. వేదపాఠం మీద, వేదస్వరం మీద ఉంది అతని ధ్యాస.

రాక్షసులు మీద పడ్డారు. కచుణ్ణి చంపేశారు. బృహస్పతినీ, దేవత లందర్నీ చంపివేసినంతగా సంతోష పడ్డారు. కచుడి శవాన్ని ఓ చెట్టుకు కట్టే శారు. వారి దారిన వారు పోయారు.

సూర్యుడు కుంకుతున్నాడు. హోమ ధేను వులు ఇంటికి వచ్చినయ్. కచుడు రాలేదు.

దేవయాని కచునికోసం కాలుకాలిన పిల్లిలాగా యిల్లంతా తిరిగింది. నుంచోలేదు, కూర్చోలేదు. తండ్రి దగ్గరికి పోయింది.

"చూడండి నాన్నా! 'వాడి పయూఖముల్ గలుగువాడు'—సూర్యుడు— అపరాంబుధిలో కుంకాడు. ఆవులు ఇళ్లకు వచ్చేసినయ్. మీరు సాయంకాలం హోమాలు కూడా చేసారు. పొద్దుపోయింది. కచు డింకా ఇంటికి రాలేదు. అడవిలో ఏమయ్యాడో ఏమో?.... పురుగే ముట్టుకుందో, పులే మింగిందో?... మనవాళ్లే ఏమన్నా చంపేశారో ఏమో.... కర్మ" అంటూ చేతులు పిసుక్కుంది. కంఠం ఆక్రో శిస్తూంది.

శుక్రాచార్యులు దేవయాని 'ఇది' గమనిం చారు. యోగదృష్టితో చూచారు. మంత్రించారు. సంజీవనీ విద్యాబలంవల్ల కచుడి ప్రాణాలు లేచివచ్చి

నయ్. కచుడు నెమ్మదిగా ఇంటికి వచ్చాడు. దేవయానీ, శుక్రుడూ సంతోషించారు.

మరొకనాడు—

దేవయాని కచుని దగ్గరికి వచ్చింది. పూలు లేక ఆమె తల బోసిగా ఉంది. కచుడు చూడలేదు. చూచినా వానికి తెలియదు.

"పూలు ఎక్కడా పలకరించలేదు కాబోలు" అంది. కచుడు తల ఎత్తి చూచాడు. కవి గారి కుమార్తె — ఆమె వక్రోక్తి వైభవానికి ఏం తక్కువ?

"తీసుకుని రమ్మంటే తెస్తాను",

"ఇదిగూడా చెప్పాలా? ఇంట్లో ఆడది ఉందని తెలీదూ!"

కచుడు తలవంచుకొని అడవికి వెళ్లాడు. పూలు కోశాడు. పూల సజ్జ నిండింది. గబగబా ఇంటికి వస్తున్నాడు.

రాక్షసులు అటకాయించారు. చంపేశారు. అంత సాధువునూ కాల్చి పారేశారు. బూడిదైనా మిగలకుండా పోగుచేశారు. తెచ్చారు శుక్రాచార్యులువారు త్రాగే మద్యంలో కలిపారు. ఆ మద్యాన్ని గురువుగారికి నివేదించి, మాటల్లోపెట్టి త్రాగించి మరీ వెళ్లారు.

కచుడు ఇంటికి రాలేదు అని దేవయాని విల విల లాడింది. గగ్గోలు పడింది. తండ్రి దగ్గర అవుర్న ఏడ్చింది.

శుక్రాచార్యులు చూచారు. "అమ్మా కచుడు చనిపోయాడు" అని చెప్పారు. పిడుగు పడ్డట్టు అయింది దేవయానికి—

"కచుడు నాకు ఇష్టుడు. అతను చనిపోయాడా? చనిపోయాడా?" అంటూ వావురుమంది. తండ్రి ఓదార్చబోయారు.

"నాన్నా! లోకోత్తరుడైన అంగిరసుని మనమడే. తపోనిధి బృహస్పతి అంతవారి కుమారుడే. ఆశ్రితుడే, మీకు శిష్యుడే సబ్రహ్మచారిగాని మరొకటి కాదే. అతనికోసం ఏడ్వక ఎల్లా ఉంటాను? అతనికోసమే చూస్తూవుంటాను. అతన్ని చూచి కాని మరి ఎంగిలి పడను" అంటూ ఏడుస్తూ కూమంది.

"తల్లీ! కచుణ్ణి రాక్షసులు బూడిద చేశారు. ఆ బూడిద మద్యంలో కలిపి నాకిచ్చారు. కచుడిప్పుడు నా కడుపులో ఉన్నాడు. ఎట్లా వస్తాడమ్మా!" అని కుమార్తెను ఓదార్చారు. కుమార్తె ఏడుపు మానలేదు. "నాన్నా! నీ కడుపులో ఉన్న కచుణ్ణి బ్రతికించు నాన్నా! కచుడు లేకపోతే నాకేం సుఖం లేదు నాన్నా!" అని ఏడ్చింది.

"బ్రతికితే మాత్రం బయటికి ఎలా వస్తాడమ్మా! నేను చచ్చిపోనూ...."

"ఇదేం కర్మ నాన్నా! ఇట్లాగయితే ఎట్లా? కచుడు లేకపోతే నాకు సుఖం అంటూ లేదు. నువ్వే లేకపోతే నాకు జీవితమే లేదు" అంది దేవయాని.

ఆలోచించింది.

"నీ సంజీవనీ విద్యను కచుడికి ఉపదేశించు నాన్నా! అతను బ్రతుకుతాడు. బయటికి వస్తాడు. నిన్ను బ్రతికిస్తాడు. ఇద్దరూ నాకు దక్కుతారు" అంది. "ఇంకా చూస్తావేం నాన్నా!" అంటూ కొందర పెట్టింది.

"రాక్షసులు తనను ద్వేషిస్తారు, నిజమే. కాని, తన కన్నకడుపు దేవయాని వ్యధపడుతోంది. దీని ఏడుపు చూడలేను" అనుకున్నాడు. సంజీవనీ విద్యతో కచుణ్ణి బ్రతికించాడు. గురువుగారి గర్భవాసం చేసిన కచుడు చందమామ ఉదయించినట్లు ఉదయించాడు. బ్రతికి బయటపడి, గురువుగారిని బ్రతికించాడు. దేవయాని మొహం కలకల్లాడింది.

మద్యపానంవల్ల గదా ఇంత చెరుపు వచ్చింది అనుకున్నారు శుక్రాచార్యులు. ఇలా అన్నారు— "ఇదుగో! నేను ఈ మర్యాదను ప్రతిష్ఠిస్తున్నాను. జ్ఞానం కలగాలి అనుకొనేవారు— ఎవరైనా సరే— ఇది మొదలు మద్యాన్ని సేవించ గూడదు. బుద్ధి లేక ఏవరైనా మద్యాన్ని సేవిస్తే, ధర్మ భ్రష్టుడు అవుతాడు. ఈ లోకంలో వాణ్ణి గర్హిస్తారు. ఇహంలో నిందేకాదు, పరంలోనూ వాడి గతి అంతే. ఇది ధర్మ సీమ. ఇది మర్యాద. ఈ లోక నివాసులూ! దేవతలూ! వినండి. ఈ మర్యాదను పాటించండి" అని ధర్మ ప్రతిష్ఠ చేసారు. దేవతలయందు కార్పణ్యం వహించిన రాక్షసులను పిలిపించారు. ఆ దానవులు తలలు వొంచుకొని వచ్చారు. గంభీరంగా ఘోషించారు. ఏమని?—

"మీరు మూర్ఖులు. కచుడు నా దగ్గర ఉన్నాడు. చూస్తారా? అడుగో వాణ్ణి చంపాం అని ఎగురుతున్నారేమో! వాడికి సంజీవనీ విద్య ఉపదేశించాను. ఇప్పుడు కచుడు బ్రహ్మదేవునంత వాడు."

దానవులు తెల్లబోయారు. ఏమనగలరు? ఒక్క దణ్ణం పెట్టి వారి దారిన వారు వెళ్ళిపోయారు.

కొంత కాలం జరిగింది.

తలి దండ్రులను చూడాలని, తన ఇంటికి పోవాలని గురువుగారితో కచుడు చెప్పాడు.

"నాయనా! నీ నియమ నిష్ఠలు నన్ను ఆనందింప జేసినవి. నీవు వేదమూర్తి వి. ఇంటికిపోయి తలి దండ్రులకు ఆమోదం ప్రమోదం కలిగించు" అని దీవించారు గురువుగారు.

కచుడు ఇంటికి బయలుదేరాడు. దేవయాని సెలవు తీసుకోవాలని వచ్చాడు. "బ్రహ్మదేవుని వంటి వారా!" అని పలకరించింది దేవయాని.

"ఇంటికి వెళదాం అనుకొంటున్నానండీ! మా తలి దండ్రులు గూడా, 'కచుడు రావాలి, కచుడు రావాలి, వస్తాడు, వస్తాడు, అడుగో, ఇదుగో' అని ఎదురు తెన్నులు చూస్తున్నారుట" అన్నాడు కచుడు.

దేవయాని కిలకిలా నవ్వింది.

"మీరు నన్ను ఎంతో ఇదిగా ఆదరించారు. అమితమైన వాత్సల్యం చూపించారు. గురువుగారు కన్నబిడ్డను చూచినట్లు చూచారు. కృతార్థుణ్ణి" అన్నాడు కచుడు.

"నాతో చెప్పడం దేనికీ?"

"మీరుకూడా అనుజ్ఞ ఇస్తే, మరి వెళతాను"

"అనుజ్ఞ ఇవ్వననుకొండి, ఉండిపోయేట్లుందే మీ ధోరణి" నవ్వింది.

కచుడు స్తబ్ధు.

"మాటవరసకు అన్నాను గానీ, మీరేమిటి, నావంటిది, అమాయకురాలు, ఉండిపొమ్మంటే ఉండి పోవటం ఏమిటీ?" అనీ అంది.

కచుడు ఏమీ మాట్లాడకపోవడం చూచింది. అందుకుంది.

"మీరా, కచ బ్రహ్మలు. అంగిరసులవారికి పౌత్రులు. పుట్టుకచేత, నడవడిచేత, విద్యచేత, నిగ్రహంచేత, తపస్సుచేత గొప్పవారు. అంగిరసులవారు ఎంత పూజనీయులో. మహానుభావులు బృహస్పతీ అంతవారు. నాకు మా తండ్రివంటి వారు. మీరు విద్యా పరిపూర్తి చేసుకున్నారు. కావలిసిందేముందీ, ఇంక...." అని ఆగింది.

"సమంత్రకంగా నన్నుపరిణయం చేసుకోట మేనన్నమాట" అంది చివరికి. కచుని కన్నులలో కన్నులు పెట్టుకునిఉంది.

"మీరు గురువుగారి కుమార్తెలు. గురువుగారు నా తండ్రివంటి వారు. వారికి నేను విద్యా పుత్రుణ్ణి. వారి గర్భవాసంకూడా చేసాను. మీరు ఇట్లాగనడం భావ్యంకాదు" అన్నాడు కచుడు.

"పుత్రుడివంటి వాడివేగానీ. పుత్రుడవుగావు అని తెలుసుకున్నావు గద. అంతే. అసురులు నిన్ను చంపినప్పుడు నేనెందుకు నిన్ను బతికించుకున్నానో యోజించుకోవేమి. వేదమూర్తీ! భక్తురాలిని, అనురక్తురాలిని విడిచి వెళ్లటానికి ఎలా నీ ప్రాణాలు ఒప్పుతున్నాయి" అని అడిగింది దేవయాని.

పొందిక అయిన ఆమె కనుబొమ్మలు ఆమెను వ్యాఖ్యానిస్తున్నయ్.

"శుభాచారం గలవారు మీరు. ఓ శ్రేష్ఠమైన కనుబొమ్మలుకల దేవయానీ! నా మనస్సు ఇది. దయవుంచి వినండి. మీరూ నేనూ గురువుగారి గర్భ సంజనితులం. మీరు నాకు తోబుట్టువు వంటివారు. నన్ను మీరు కూడని పని చేయమనడం భావ్యంకాదు. ఎవరిని మెప్పించడానికయినా సరే, ధర్మాన్ని నేను తృణీకరించలేను. నన్ను మన్నించండి. అనుజ్ఞ ఇవ్వండి. మీ సెలవు తీసుకొని మా ఇంటికి పోతాను."

దేవయాని నిట్టూర్చింది. ఆమె, ఆమెకాదు.

"పెద్దలు, మా గురువుగారిని కనిపెట్టి వుండండి. వెళ్లవస్తా" గురుస్మరణ చేసేసరికి కచుని కన్నులు తడిసినై.

దేవయాని దెబ్బతిని లేచినట్లు లేచింది.

"ధర్మకామార్థాలకు అయిన నన్ను, నన్ను తృణీకరించి పోతున్నావా? నీకు సంజీవనీ విద్య అబ్బింది అనేగదా గర్వం. పో, నీ కా విద్య ఫలించదులే."

"గురు పుత్రివి, విద్యాసోదరివి. మీరు ఇల్లాగన్నారని నేనేమీ అనుకోను. కానీ, గురువుగారి అనుజ్ఞ లేకుండా మీరు నన్ను ఇష్టంవచ్చినట్లు అంటున్నారు. నేను ధర్మాన్ని అవలంబించాను. తగని వాణ్ణి నన్ను మీరు కోరారు. తగని వానికే మీరు అవుతారు లెండి, వెళ్లొస్తా" అన్నాడు కచుడు. నమస్కరించాడు.

ఇంటికి వెళ్లాడు. ఇంద్రాది దేవతలు ఇంటికి తిరిగి వచ్చిన కచుణ్ణి ఎంతో గౌరవించారు. ధర్మలోపం జరపనందుకు తండ్రి కొడుకుని ఎంతో మెచ్చుకున్నాడు. తనకు ఫలించదు గనుక తన సంజీవనీ విద్యను ఇతరులకు చెప్పాడు కచుడు. దేవకార్యం ఇలాగ సఫలం అయింది. దేవతలు కృతార్థులయినారు.

ఆ తరువాత ఒకనాడు శర్మిష్ఠ, దేవయానీ, వాళ్ల చెలికత్తెలూ ఉద్యానవనానికి వెళ్లారు.

శర్మిష్ఠ రాక్షస రాజైన వృషపర్వుని కుమార్తె. దేవయానీ, శర్మిష్ఠా స్నేహంగా ఉండేవారు. కలిసి ఆడుకొనేవారు. ఆనాడూ ఎప్పటిలాగానే వనానికి చెలికత్తెలతో వెళ్లారు.

ఆ ఉద్యానవనం కుబేరుడి చైత్ర రథంలాగా వుంది. ఆటలాడి ఆడి ఆ కన్యలు క్రీడా సరస్సులోకి దిగారు. జలక్రీడలకు దిగిన ఆ కన్యలు తాము కట్టుకున్న బట్టలు ఆ సరస్సు ఒడ్డునే ఉంచారు. జలక్రీడలు ఆడుతూన్నారు.

సంజీవనీవిద్య తెలిసిం తరువాత దేవతలకు రాక్షసుల భయం పోయింది కదూ. వాయుదేవుడు ధీమాగా వచ్చి ఆ ఆడకూతుళ్ల చీరల్ని ఎగరగొట్టేశాడు. ఒడ్డున పెట్టుకున్న బట్టలు ఉంగలు చుట్టుకున్నయ్. ఉంగలు ఉంగలుగా చుట్టుకున్నవి, ఎగిరెగిరి పోతున్నయ్.

ఈ కన్యలు చూచారు. దబదబా గట్టుకు చేరారు. ఆదరా బాదరా ఆ చీరల్ని ధరించారు. ఆ తొందరలో దేవయాని చీరను శర్మిష్ఠ కట్టుకుంది. దేవయానికి శర్మిష్ఠ చీర చేజిక్కింది. ఇంకొకరి వస్త్రం తాను కట్టుకోడానికి రోతపడింది దేవయాని. "నా వస్త్రాల్ని నువ్వు ధరించవచ్చా? ఎందుకు ఇట్లా చేశావు?" అంది శర్మిష్ఠతో.

"ఏం?" అంది శర్మిష్ఠ.

"నే నెవ్వరనుకున్నావు? శుక్రాచార్యులవారి కుమార్తెను. నువ్వు మాకు శిష్యురాలివి.... రాక్షస స్త్రీవి. నీకు సదాచారం ఎక్కడ తెలిసి ఏడుస్తుంది" అంది దేవయాని.

శర్మిష్ఠ నవ్వింది.

"ఇదా నీ గొప్ప. మీ నాన్నను చూచుకొనా? మీ నాన్న మా నాన్నవెంట తిరుగుతాడు. మా నాన్నకు కిందనుంచుని భట్రాజులాగా పొగడుతాడు. మీ అయ్య గొప్పలు నా దగ్గిర చెప్పకు. అడుక్కునేవాడి కూతురివి. యాచకుడి కుమార్తెవు.... నా సంగతి గూడా చెప్పమంటావా? ఇచ్చేవాడి కూతుర్ని. చేయి చాచనివాడి కూతుర్ని. స్తోత్రం చేయించుకునేవాడి కూతుర్ని. చాలా?" అంది శర్మిష్ఠ. ఇంకా "ఈ బోడి భాగ్యానికి నా చీర కట్టడం నీకు పరువుతక్కువైందేం?.... అ—బ్బో—" అంటూ శర్మిష్ఠ దేవయానిని అక్కడ ప్రక్కనున్న ఒక పాడుబావిలోకి తోసింది. తన చెలులతో తాను వెళ్ళింది.

అక్కడికి నహుషుని కుమారుడు యయాతి మహారాజు వచ్చాడు. ఆయన వేటకని బయలు దేరాడు. రథానికి కట్టిన గుర్రాలు అలసినై. ప్రక్కన వస్తూన్న గుర్రాలు దప్పికొన్నయ్. యయాతి మహారాజూ అలసి ఉన్నాడు.

ఆయన దైవికంగా దేవయాని పడి ఉన్న నూతి దగ్గిరికి వచ్చాడు. నీళ్లకోసం ఆ నూతిలోకి చూచాడు. నూతిలో నీళ్లు లేవు. తీగెలూ తిప్పలూ తప్ప. ఆ తీగల మధ్య అగ్నిశిఖలాంటి ఆడపిల్ల ఉంది. దేవతాస్త్రీ లాగా ఉంది ఆమె. నూతిలోని ఒక తీగెను పట్టుకొనివుంది. కన్నీరు కారుస్తోంది. చేయి వణుకుతోంది. ఆమె చేతిగోళ్లు రాగిలాగా ఎర్రగా ఉన్నయ్.

"ఎవరు నువ్వు? ఈ పాడు నూతిలో ఎలా పడ్డావు? ఎందుకు ఏడుస్తున్నావు? ఎవరు వస్తారని ఎదురు చూస్తున్నావు?" అని అడిగాడు యయాతి.

దేవయాని వగలమారి ఏడుపు ఏడుస్తూనే వుంది. శర్మిష్ఠ తనను నూతిలోకి తోసిందని కసిగా వుంది ఆవిడకు. ఏడుపుదారిన ఏడుస్తూనే— "నేనా?— దేవతలు చంపిన రాక్షసుల్ని తిరిగి బ్రతికిస్తారే శుక్రాచార్యులుగారు, ఆయన కుమార్తెను. ఈ నూతిలోంచి బయటికి రాలేక ఇదవుతున్నాను. మీరు ఎవరో మహానుభావులు లాగా వున్నారు. నన్ను పైకి తీయండి." అంటూ చెయ్యి చాచింది. యయాతి మహారాజు నూతిమీదికి వంగాడు. రాజ్యభారం వహించిన తన కుడిచెయ్యి నూతిలోకి చాచాడు. దేవయాని చేయిపట్టుకున్నాడు. ఆమెకు ఏ శ్రమా కలగకుండా నూతిలోంచి బయట పడేశాడు. 'వెళ్తా' అని చెప్పి తన దారిన తాను పోయాడు.

ఘూర్ణిక అనే దాసి దేవయానిని వెతుక్కుంటూ వస్తోంది. ఇది దేవయాని చూచింది. తన మనసులోని మంటను మరికొంచెం పెంచుకుంది. ఘూర్ణిక దగ్గిరికి రాగానే— "పోవే, ఇంకా కళ్లు అప్పగించి చూస్తావేం? పో, పోయి మా తండ్రిగారితో చెప్పు. 'అమ్మాయి నూతిలోనుంచి బయట పడింది, వృషపర్వుని నగరంలో అడుగు పెట్టనంది' అని, పో చెప్పు" అంటూ విసిరి పంపింది.

ఘూర్ణిక వెళ్లి శుక్రాచార్యులతో దేవయాని మాటలు చెప్పింది. శర్మిష్ఠ తన కుమార్తెను నూతిలో పడదోయడం ఘూర్ణిక చెప్తుంటే శుక్రుడు విన్నాడు. ఘూర్ణిక తొట్రుపాటూ అదీ చూచి "ఏం ప్రమాదమో?" అనుకున్నాడు. గబ గబా బయలుదేరాడు. వెతుక్కుంటూ ఉద్యాన వనానికి వచ్చాడు. కూతుర్ని చూచి 'హమ్మయ్య' అనుకొన్నాడు. కుమార్తెను పొదివి పట్టుకున్నాడు. తేరుకున్నాడు.

"అమ్మాయీ! ఈ కర్మం ఏమిటి? ఎవరైనా సరే, తాము చేసిన పనులవల్ల సుఖ దుఃఖాలను పొందుతారు. నువ్వు ఏం చేసావనీ ఈ పాటు?" అన్నాడు.

"నా కర్మానికేంగానీండి, నాన్నా! శర్మిష్ఠ, ఆ వృషపర్వుడి కూతురు, అల్లా కూసిందే- అదంతా నిజమేనా?"

శుక్రాచార్యులు చూస్తున్నారు.

" — మీ అబ్బ మా దానవులకు వంది, గాయకుడు, యాచకుడు. ఇచ్చింది పుచ్చుకొనేవాడు. నేను రాజ కుమార్తెను, ఇచ్చేవాడి కుమార్తెను. చెయ్యిచాచని వారి బిడ్డను! అంది శర్మిష్ఠ" అని చెప్పింది దేవయాని.

శర్మిష్ఠా దేవయాని కీచులాడుకోటం శుక్రుడు గ్రహించాడు.

"అమ్మా! అదేం మాట, అదంతా వట్బర, అమ్మా! నువ్వు నా కూతురువి. నేనేం చెయ్యిచాచే వాణ్ణి కాను, యాచించేవాణ్ణి కాను, స్తోత్రం చేసే వాణ్ణి కాను. అదంతా ఆ వృషపర్వుడు. ద్వంద్వాలు లేని బ్రహ్మ పదార్థం, ఇది ఇల్లాంటిది అని చింతన చేయడానికి సాధ్యంకాని బ్రహ్మ పదార్థం నాకున్న ఐశ్వర్యం తల్లీ! బ్రహ్మదేవుడు సంతోషం కొద్దీ— శుక్రా! భూమిమీద కానీ, స్వర్గంలో కానీ ఉన్నదంతా నీది. నువ్వు దానికి ప్రభువు అన్నాడమ్మా! ప్రజలకు మేలుకోరి జలాలను నేను విడిచిపెడతాను. ఓషధులను పోషిస్తానమ్మా! ఇదా ఇదా నీ వ్యథ. నిజం తెలిసిందా తల్లీ!" అంటూ దేవయానిని శుక్రుడు ఓదార్చాడు.

మళ్లీ "అమ్మా!" అన్నాడు. దేవయాని తల ఎత్తి చూచింది.

"ఇతరులు అతివాదాలు చేస్తుంటే, ఓర్చుకోడం గొప్ప సంగతి. అట్లా ఓర్చుకున్నవాడు సమస్తాన్నీ జయిస్తాడు. తల్లీ! ఉబికి ఉబికి వచ్చే క్రోధాన్ని, గుర్రాన్ని కట్టినట్టు, ఎవరు నిగ్రహిస్తారో, వారే నియంతలు. పగ్గాలు పట్టడం నీతిని పట్టినట్టు అవుతుందమ్మా! పాము కుబుసాన్ని వదిలి పారేసినట్లు, ఎవరు క్రోధాన్ని వదిలేస్తారో వారే నమ్మా పురుషకారం గలవాళ్లు. ఉడికిపోయే స్థితిలో గూడా చలించని వాళ్లెవరో, వారేనమ్మా ఏదన్నా సాధిస్తే. ఇద్దరున్నారనుకో ఒకరు వంద సంవత్సరాలు నెల నెలా యజ్ఞాలు చేసారనుకో, మరొకరు ఏమీ చేయరు. క్రోధం అంటూ లేనివారు వారు మాత్రం అని అనుకో. ఈ ఇద్దరిలోనూ అక్రోధనుడే శ్రేష్ఠుడు. తెలుసుకోవమ్మా!" అని నీతి చెప్పాడు.

"నాన్నా! నేనెంత చిన్నదాన్నయినా ఈ నీతి నాకు తెలుసు. అతివాదంలో ఓర్పు, అక్రోధనత్వం గొప్పవి అని తెలుసు. కానీ, చూడండి. శిష్యుడి కూతురు, శిష్యుడికి శిష్యురాలు ఆ విధంగా ఉంటే, ఇల్లాంటి సంకరుల దగ్గర మనం ఎల్లా ఉంటాం చెప్పండి!" అంది దేవయాని. మళ్లీ "నడవడినీ కులాన్నీ నిందించేవారి దగ్గర, శ్రేయస్సు కోరుకొనేవారు నివసించ గూడదు. నడవడినీ. జాతినీ తెలుసుకొనేవారి దగ్గిర నివసించడం శ్రేష్ఠం. వృషపర్వుడి కూతురు, అది, పల్కిన కారాకులు నా హృదయాన్ని మథిస్తున్నాయ్. ముల్లోకాల్లో నయినా సరే, నాన్నా! శత్రువు ప్రభను తాను తగ్గి వుండి సేవించడం కష్టం. అంతకంటే చచ్చిపోవడం మెరుగు" అంది దేవయాని.

కూతురి మాటలు శుక్రాచార్యులకు తలకెక్కినయ్. సరాసరి వృషపర్వుడి దగ్గిరికి వెళ్లాడు.

"రాజా! చేసిన అధర్మం ఆవువంటిది కాదు. వెంటనే ఫలించదు. నెమ్మదిగా ఆ పని చేసినవారిని గిల్లి పారేస్తుంది. ఏ పాప లేశమూ ఎరుగనివాణ్ణి, ధర్మపరుణ్ణి, అంగిరసుడి మనమణ్ణి, మమ్మల్ని శుశ్రూష చేస్తూ మా ఇంట్లో ఉండేవాణ్ణి, కచుణ్ణి మీరలా వధించారే, ఇదేనా మీరు చేయవలసింది!

ఇదుగో ఇక్కడ నేను ఉండను. నేను నా వాళ్లతో సహా మీ దేశం వదిలి పోతున్నాను." అన్నాడు. కదిలాడు.

వృషపర్వుడు వచ్చి శుక్రాచార్యులవారి కాళ్ల మీద పడ్డాడు.

"గురూత్తమా! మీ విషయంలో అబద్ధం ఆడ లేదు. మీ విషయంలో అధర్మం జరుపలేదు. మమ్మల్ని వదలి మీరు ఇక్కడ్నుంచి వెళ్లిపోతారా? మీరు వెళ్లిపోతే మాకు దిక్కేమిటి? సముద్రంలో పడిపోతాం. అంతే." అన్నాడు వృషపర్వుడు.

"సముద్రంలో పడతారో, దిక్కులకూ, దిగంతాలకూ పారిపోతారో, మీ ఇష్టం. నా కుమార్తెకు అప్రియం జరిగితే నేను ఓర్చను. నేను కావలిస్తే— మీరు దేవయానిని బతిమిలాడుకోండి. నా ప్రాణాలు దేవయానిమీదే ఉంటాయ్. అది అంగీకరిస్తే, బృహస్పతి దేవతల యోగక్షేమాలకు కారకుడైనట్లు, మీకు నేను యోగక్షేమాలకు కారకుడుగా ఉంటాను" అన్నాడు శుక్రాచార్యులు.

"గురూత్తమా! మీరు ఎవరని? మా గురువులు. ఈ భూమిమీద రాక్షసులంకు ఏమన్నా వైభవం అంటూ ఉంటే మీరు దానికి ప్రభువులు." అని చేతులు నలుపుకున్నాడు వృషపర్వుడు.

"దేవయానిని బతిమాలుకోండి" అని శుక్రాచార్యులు కూతురు దగ్గరికి వెళ్లారు. చెప్పారు.

"నాన్నా! మీరంటే ఏం లాభం? ఆ రాజు. వాణ్ణి వచ్చి చెప్పమనండి" అంది.

రాజు, వృషపర్వుడు వచ్చాడు. దేవయాని నవ్వింది.

"దేవయానీ! శుచిస్మితా! నన్ను మన్నించమ్మా! నువ్వు ఏం కోరుకుంటావో, కోరుకోమ్మా! ఎంత అసాధ్యం అయినా సరే! నీ కోరిక నెరవేరుస్తా-నమ్మా!" అని అన్నాడు.

"నీ కుమార్తె శర్మిష్ఠ నాకు దాసి కావాలి. శర్మిష్ఠకు ఉన్న దాసీలు, వెయ్యిమంది కన్యలూ నాకు దాసీలుగా కావాలి. నన్ను మా తండ్రి ఎవరికి ఇస్తే, వీరూ అక్కడికి నా వెంట రావాలి. ఏం?'' అంది దేవయాని.

వృషపర్వుడు అక్కడ ఉన్న దాసితో శర్మిష్ఠకు కబురు పెట్టాడు. దాసీది వెళ్లి శర్మిష్ఠకు చెప్పింది. శర్మిష్ఠకు పై ప్రాణం పైనే పోయినట్లు అయింది. దాసీది మళ్లా—"అమ్మా! నీ కిది పిడుగుపాటే, నిజమే. కాని, తల్లీ! నీ జ్ఞాతులను తలుచుకో. వాళ్లయినా సుఖపడాలని కోరుకో. గురువుగారు, శుక్రాచార్యులుగారు తమ శిష్యులను, మనల్ని వదిలిపోతారుట మరి. వారికి దేవయాని అట్లా పురి ఎక్కించింది. ఆ దేవయాని పట్టు పట్టుకున్నాడమ్మా!" అంది.

శర్మిష్ఠ నిట్టూర్చింది.

''అలాగే. అది, దేవయాని కోరినట్లేచేస్తాను. నా దోషంవల్ల శుక్రుడూ ఇక్కడినుంచి వెళ్ళిపోనక్కరలేదు''అంది. దేవయానీ వెళ్లిపోనక్కరలేదు. తన చెలులు, వెయ్యిమంది కన్యకలతో వెళ్ళింది.

దేవయానికి నమస్కరించింది. తల వొంచుకుని, ''నేను, శర్మిష్ఠను, నా దాసీ సహస్రంతో నీకు దాసిని, పరిచారికను అయ్యాను. మీ తండ్రి నిన్ను ఎక్కడ ఇస్తే, అక్కడికి నేనూ నీవెంట నీ దాసిగా వస్తాను'' అంది.

"భట్రాజు కుమార్తెను నేను, స్తోత్రం చేసి బతికేవాడి కుమార్తెను, చెయ్యి చాచి ఇచ్చింది పుచ్చుకునేవాడి కుమార్తెను. నువ్వు, స్తోత్రాలు చేయించుకునేవాడి కుమార్తెవే మరి. నువ్వు నాకు దాసివి అవుతావా?" అని అడిగింది దేవయాని.

(మిగతా చివరి పేజీలో)

# హే విశ్వకవే!

బొమ్మకంటి శ్రీనివాసాచార్యః

క్రౌంచం నిషాద శర దర్శిత మృత్యు వక్త్రమ్
క్రౌంచీం చ వీక్ష్య సవిధే కరుణం రుదన్తీమ్
సత్వాకృతి స్త్వ మభవః కరుణావతారః
యేనాదికావ్య ముదభూ ద్రస నిత్య శోభి

ధర్మస్య హాని రథ మోహమదాది వృద్ధి
జ్ఞాతా యదా భరత పుణ్య తపోవనేఽస్మిన్
త్వం పంచమ శ్రుతి శుభాం పరిగృహ్య వాణీమ్
ధర్మాను రక్తి మకరో స్సకల ప్రజాసు

అస్యాం మహర్షి కరుణాధృత భారతోర్వ్యామ్
ఇష్టై సమస్త విభవైః పరిశోభితా యామ్
కాళీ ప్రసాద కృత వాగ్విభవ స్తదానీమ్
శృంగార వృష్టి మమలాం వ్యకిరస్త్వ మేవ

రత్యా ప్రజాహృదయ నీరసతాం ప్రమృజ్య
వీరోక్తిభి శ్చటులై నిస్పృహతాం ప్రహార్య
సిక్త్వాచ కర్కశ ధియః కరుణామృతేన
మర్త్యాన్ పునః పున రహో కృతవా నమర్త్యాన్

విస్మృత్య పూర్వ విభవం పరరాజ్య దాస్యే
దేశో యదాఽఽ భవదయం బత భాదరిద్రః
త్వత్తః పునః ప్రసృమరా భరతార్షవాణీ
సర్వావనీ జన మనోహరణే ప్రవీణా

యాప్యస్తునామ బహిరాకృతి రాత్మవన్! తే
యాప్యస్తు కంఠ సరణిశ్చ సదా విశిష్టా
జానామి నూన మిహ గాయక నాయకం త్వామ్
జానామి విశ్వకవి మచ్ఛ రసాకృతిం త్వామ్

# వచన పద్యం

దామెర్ల మల్లారెడ్డి

తెలుగు కవిత్వంలో వచన పద్యం అన్న కవితాస్వరూపం వచ్చి పాతికేళ్ల య్యింటుంది. దీన్నే ముక్తచ్ఛందమనీ, గద్య గంధి వచనమనీ, స్వేచ్ఛాకవిత అనీ, వ్యవహరిస్తున్నారు. ఇది సంప్రదాయికంగా వస్తూవున్న పద్య స్వరూపానికంటే అతీతమైందీ, దేశీ మార్గంలో వస్తూవున్న మాత్రాచ్ఛందస్సుకు దూరమైందీకూడా. ఈ రెండింటిలోనూ ఉండే నియమ బంధాలు ఈ రచనలో వుండవు.

పద్యములందు వుండే గణములూ, యతులూ, ప్రాసలూ కవితా సౌందర్యానికి ప్రతిబంధకాలుగా భాసించి మాత్రాచ్ఛందస్సు తత్ స్థానాన్ని ఆక్రమించే యత్నంచేసినట్లు మాత్రాచ్ఛందస్సులో ఉన్న మాత్రా నియమమూ గణనియమమంత కఠినమైంది కాక పోయినా — నియమము నియమమే కాబట్టి— ఆ అల్పమైన నియమంకూడా లేకుండా కవిత్వం స్వచ్ఛందంగా నిసర్గంగా రచింపబడటం ఈ కవితా స్వరూపాన్ని తేవడంలోని ప్రయోజనం.

ఈ వచనపద్యం అనేసరికి మన విమర్శకులు బాణున్నీ, దండినీ లాక్కొచ్చే ప్రయత్నంచేస్తారు. బాణుడూ, దండీ చేసిన రచన వచనమే కాని పద్యంకాదు. అందుకే పద్యకావ్యాలతో పాటు గద్యకావ్యాలను కూడా పేర్కొనవలసి వచ్చింది. అది ఛందోమయమైందికాదు. ఛందోవాసనకూడా లేంది. ఈ మాటకు ఆ కావ్యాలలోంచి ఏవోకొన్ని వాక్యాలలో వృత్తప్రస్తారంచేసి కొందరు విమర్శకులు చూపవచ్చు అదికాకతాళీయమే. రచన వచనమే. వచన రచనలోఉండే వాక్య నిర్మాణపద్ధతే వేరు.

వచన పద్యంలోమాత్రం ఛందస్సు ఏం ఉంది? అదీ గణమాత్రానియమరహితమేకదా? అని పూర్వపక్షంరావచ్చు. కాని ఈ కవితా స్వరూపంలో కాదంబర్యాదుల లోని వచనత్వం ఉండదు. కాదంబర్యాదుల్లో ఉండే కవితాశక్తి ఎంత ఉజ్జ్వలమైందైనా అందులోని వచన స్వరూపంకూడా అంత స్పష్టమైందే. వచనపద్యంలో కొన్ని చోట్ల ఈ కవితా ప్రభ తగ్గిపోయినా ఆ వచనత్వం ఉండదు.

ఈ సందర్భంలో మనం గమనించవలసిన విషయం కవితాశక్తి వేరూ, గద్యపద్యాదికమైన భేదం వేరు. ఒక్కోచోట పద్యంలోనూ కవితాశక్తి ఉండకపోవచ్చు. వచనములో ఉండవచ్చు. కాదంబర్యాదులు

కావ్యాలవడానికి వాటిల్లోని కవితాశక్తి కారణమేకాని వాటి ఛందో విశేషంకాదు. కావ్యత్వం స్వరూపాన్నిబట్టి వస్తుందా ?

వచనపద్యంయొక్క స్వరూపమే వేరు. సంస్కృత చంపూ కావ్యాలలో, తెలుగులోని కావ్యాలలో గోచరించే వచనం కూడా కాదంబరిజాతికి చెందిన వచనమేకాని అదీ పద్యంగా చెప్పబడదు. ఈ పద్య గద్య భేదాన్ని స్పష్టంగా పెద్దలుకూడా గమనించక పోవడం చాలా ఆశ్చర్యకరమైన విషయం.

"ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణవైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయ గాంభీర్య ధైర్యజేగీయమాన హృదయుండును హృదయ చాంచల్యమాన తామసుండును, తామసగుణ చంక్రమ్యమాణ స్థైర్యుండునునై నిస్త్రింభంబున హుంకరించి, గాలుని ధిక్కరించి కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్ద పూర్వకంబుగా ................"
(ఆంధ్ర భాగవతము. సప్తమస్కంధము 285)
ఈ వచనమునొయొక్క రచన సామాన్యమైన గద్యముగా గోచరించదు. దీనియందు కావ్య గుణాలైన వస్త్వలంకార శయ్యా చమత్కార సామగ్రి లక్షఉంది. దీనిలో ఒక లయానుగుణమైన వాక్య విన్యాసపద్ధతి ఉంది. శబ్దముల కూర్పులోని వైలక్షణ్యముకూడా ముఖ్యంగా గమనించవలసింది దీనిలో గోచరిస్తుంది. ఐనా ఇది వచననే. దీన్ని పద్యమని అనడానికి వీలు లేదు. దీనిలో పద్యానికి దగ్గరగావచ్చిన లక్షణమేకాని యిందులో పద్యత్వంలేదు. ఇలానే వచనపద్యమన్న రచన యతిప్రాస గణ మాత్రాచ్ఛందో నియమ రహితమయ్యా కూడ వచనానికి దగ్గరగా వస్తుందేకాని వచనంకాదు.

వచనానికి దగ్గరగా వచ్చిన కారణాన వచనంకాని దాన్ని వచనమని అనలేము. అదీ ఒకవిధమైన పద్యభేదంగా నేస్వీకరించాలి. శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు తమ భావ సంకీర్తనంలో సీసపద్యాల రచన పూర్తిగా వచన మన్నట్టుగా రచించారు.

"నామనవి వినుము
నాకున్న భయ మెడలింపుము
నన్నుఁ బాలింపుము
మునుపెన్ని జన్మంబుల నెత్తితినో
యప్పుడే నిన్నుఁ దెలిసియైనఁ దెలిసి కొనకైన
భజియించు కొంటినో లేదో యెఱుంగ ।
నా భాగ్య నిరూఢినేమొ.
యీ పుట్టువు భవతాపహరమగు
నీ శ్రీచరణాబ్జ సంసేవ సేయు భక్తిగలిగినది.
మఱెన్ని భవములైన నిది విడకయుండ
నొక వరమిమ్ము నాకు.
ఎపుడు నీచిత్తమెరిగి. నీకృపకు మరగి
ఇందు నెందును సేవించు కొందును ప్రభు ।"
(64 వ పద్యము)

ఇందులో పద్యములో ఉండే గుణాలు ఏవీ లేవు. ఒక్క ఛందస్సు తప్ప; సూటిగా తన భావాన్ని చెప్పుకోదలచి పద్యగతములైన గుణాలకు దూరంగా పద్యం రచించుకొన్నారు వేంకటపార్వతీశ్వరకవులు. పద్య

రచనలో ఉండే ఆడంబరమూ, సంగీతమూ, అలంకారాల తోడుగులూ ఈ రచనలో ఉండవు.

ఈ వచన పద్యాన్ని కవితారంగం మీదికి తెచ్చిన ప్రధాన కారణాల్లో "ఈసూటి గా చెప్పాలి" అనే ప్రయోజనంకూడా ఒకటి.

ఈ లక్షణమే "విశ్వనాథ మధ్యాక్కఱ"లలో గోచరిస్తున్నది.

"శిరమునుండి స్వర్గంగ చిగివచ్చి చెంతను నిలువ
గిరిరాజ దుహిత కోపమున నరమేని కేరింతవదల
గరళంపు మెడకాంతి మేన నెల్లెడ గ్రిమ్మగా శివత
విరజిమ్మి వచ్చితోయిటకు మున్నంగి వేణుగోపాల"

(మున్నంగి శతకము)

ఈ పద్యంలో శివుడే తన తనాన్ని విరజిమ్ముకొని వేణుగోపాలుడు కావడం వంటి సుందరమైన భావంకూడా స్పష్టంగా సూటిగా దాదాపు వచనంవలె - చెప్పబడింది.

స్పష్టంగా సూటిగా చెపుతూ పద్య సహజమైన సంగీత లక్షణాలూ సౌకుమార్యాదులూ లేకుండా పద్యం రాయకుండా— ఆధునిక కవులు ఈ మార్గాన్ని చేపట్టారు.

ఈ రచన వచనం రాయడం అంత తేలికైన విషయం కాదు.

ఈ వచనపద్యం రచించి తేలికగా ఉండటం చాలా కష్టమైన విషయంగా గోచరిస్తుంది. నిండైన [illegible]హ, [illegible] అభివ్యక్తి ఉండాలి. ఇవి [illegible] వచనంగా [illegible]వంగా భాసించటం. [illegible] కావ్యాలలో వచనా[illegible] పద్యత్వస్ఫూర్తి [illegible] కావ్యాలకు ఎంతో బలం. ఆత్మ వేదనను వెల్లడించుకునే పద్యాల రచలలో పద్య రచన చెడకుండా వచనత్వం కలగడం, ఈశ్వరుడితో ఎదురెదురుగా మాటాడిన స్ఫూర్తికలగడం భావసంకీర్తనాది కావ్యాలకూ ఎంతో బలం. అల్లాగే వచన పద్యాలకు కూడా వచనంలోని వచనత్వంపోయి పద్యంచదివిన అనుభూతి కలగడం చాలా అవసరం. అంటే ఈరచనలో ఆ సంగీతమూ, ఆ నియమాలూ లేకపోయినా ఇందులో అంతర్వాహినిగా ఉన్న అంతర్లయ, రచనా శిల్పంలోని మెలకువలూ ఈ స్థితిని కలిగిస్తవి.

"ఇక్కడికి అందరూ రావచ్చు
ఇది పాతాళానికి మచ్చు
వెల్తురు చాలక చెడిపోయిన ఫోటో
వెనుకటి తరాలకు దిటో"
"అక్కడికి అందరూ పోవచ్చు
ఉషాదేవి ధరించిన బంగారపు జడకుచ్చు
వెన్నెల తీగల రాగాలు 'మాటో'
ఒకరికి వీటో"

(కుందుర్తి)

వర్తమానంలోకాన్నీ, భవిష్యత్తులోని ఆదర్శ లోకాన్నీ పోల్చే ఈ ఖండాలను పోల్చుకుంటే ఈ రచనాస్థితి తెలుస్తుంది. రెండు రెండు పాదాలకు అంత్యానుప్రాసను ఈ రచనలో గమనించవచ్చు. ఈరకం కవులు కవితలో వచనత్వం రాకుండా ఉండటానికి కని పెట్టిన పద్ధతుల్లో యిది ఒకటి. ఈ లోకం పాతాళానికి మచ్చు అనే రూపకం, అదేకాక మరో రెండు రూపకాల ద్వారా ఈభావంలో కొలువు తీసుక వస్తున్నాడు. ఇదే తేజస్సు

చాలని లోకం. ఇందులో కొత్త విజ్ఞానానికి ప్రవేశమే లేదు. ఈ భావాన్ని వెల్తురుచాలక చెడిపోయిన ఫోటో, అన్న మాటద్వారా సాధించాడు. అంత్యానుప్రాసలూ, రూపకాలూ సమయోచితంగా ఆధునిక కవులు వాడతారు.

వాక్య నిర్మాణంలోని మార్పువల్ల కూడా ప్రయోజనం సాధ్యమౌతుంది.

"నాకాలిసవ్వడి నాకే భయంగా
నా ఊహ పడగవిప్పిన పాములా
నగ్నంగా వాంఛా సహితంగా కన్పించి
నా ఆకృతి నాకే రెండు రంగులుగా"
(మాదిరాజు రంగారావు)

నా ఆకృతి నాకే రెండు రంగులుగా అని కనిపించింది అనే క్రియను మన ఊహను వదిలేస్తాడు.

"మురికి వొళ్లు. చింకికళ్లు మీరూపులు
కడుపోక బాదం ఆపై మీచూపులు
తోపుల్లో తుమ్మముళ్లు" (అనిసెట్టి)

మీ రూపులు, మీ చూపులు అన్న వి పంక్తుల చివరకుచేరి ఒక క్రొత్త ఊపును తెస్తవి. తోపుల్లో తుమ్మముళ్లు అన్నదానికి కూడా మీచూపులు అన్నదే విశేష్యం. ఈ విశేష్యం మళ్లీ పునరుక్తం కాకపోవడం ఒకే విశేషం.

నిజంకాదు. నిజంకాదు
నా దేశం
తొలిపూవై విచ్చిందని;
నవ వసంత మొచ్చిందని;
ఆకలితో నాల్గు చెరగు
లంటుకొంది. దహిస్తోంది. (అనిసెట్టి)

పూవై విచ్చడం, వసంతం రావడం నిజంకాదన్న విషయం చెపుతూ అబద్ధం చెపుతున్న వాళ్ల మీద కసి ఆపుకోలేక ఆ నిజం కాదనే విషయం చాలా ప్రధానమైనదిగా ముందే చెపుతున్నాడు. క్రియ మొదలు వచ్చి తన శక్తిని చూపించింది. తరువాత నిజమైన విషయం యిది అది చెప్పకుండానే "ఆకలితో నాల్గు చెరగు లంటుకొంది, దహిస్తోంది" అని చెపుతున్నాడు. అది నిజంకాదు, ఇది నిజం అని చెప్పడం వచనంలో ఆవేశం వచ్చి కవి తన ఆవేదన వెల్లడించుకొన్నాడు.

"ఆశ లేదు
ఆస్కారం లేదు
ఫలానారోజు శాపం ఆఖరౌతుందని హామీలేదు
ఫలానారోడ్డు గమ్యంజేర్తుందనే సూచన ఎక్కడా
లేదు...." (అజంతా)

ఈ రచనలో వాక్యాలు చిన్నవిగా మొదలు పెట్టి క్రమంగా వాటిని పెంచి వాటిల్లో ఒక రకమైన వేగాన్ని సాధించాడు కవి. వాక్యాంతాల ఉన్న లేదు అన్న భావంకూడా ఒక విధమైన ఊపుకు కారణమైనది.

"నడిరేతిరి మేలుకొన్న వాడెవ్వడు?
దివ్వెల నమ్మికలేమి. నీడలకుటరి
చీకటుల మెతకబుద్ధి. ఎవరికెరుక?" (బైరాగి)

నడిరాత్రి ఎవ్వరైన మేల్కొంటేగదా దివ్వెల నమ్మికలేమి మొదలైనవి తెలిసేదికి కాని అందరూ నిద్రపోయిఉంటే ఈ విషయం ఎవ

రికి తెలుస్తుంది. ఈ భావమే హాస్య రచన లోని మెలకువవల్ల కొత్తగా గోచరిస్తున్నది.

ఈ కవితా స్వరూపం ఈ విధంగా అనేక పరిణామాలు పొందింది.

కవియొక్క శక్తినిబట్టీ, ప్రతిభనుబట్టీ ఇది వివిధంగా ప్రదర్శిత మౌతుంది.

వచన పద్యాన్నే వికల్పములైన కొన్ని నియమాలకు ఒదిగించుకొని – దాదాపు ఒక ఛందస్సుగా మార్చి– తేజశ్చక్రిమన్న రచన ఒకటి వచ్చింది.

"ఊటవంటిది బ్రతుకు ఎప్పుడుదితములైన
వనవమ్ము
లేటవాల్కొరికలు మృదువు లెడతెగక
ప్రభవించుండు
ఓటమి వంగీకరించితివి ఒకసారి పీల్చుకో, కోరికల
ఆట భరింపలేను. ఒత్తిడికిలగలేను పీల్చుకోవోయి"
(సుప్రసన్న)

ఇది వచనపద్యం అనటంకంటే పద్యమే వికల్పమైన నియమాలు కలదిగా చెబితే బాగుంటుందేమో! (యతిప్రాసల నియమాలు ఉన్న వికాని, మాత్రాగణ నియమం లేదు).

ఈరోజు ఈమార్గంలో రచన చాలా ఎక్కువగానే చేయబడుతున్నది.

కేవలం ఈ మార్గాన రాసేవాళ్లు కుందుర్తి, మాదిరాజు రంగారావు బైరాగి, గోపాల చక్రవర్తి మొదలైనవాళ్లు. దాశరథి, సంపత్కుమార, నారాయణరెడ్డి, బాల గంగాధర తిలక్, సుప్రసన్న మొదలైనవారు ఈ రకమైన కవితకూడా రాస్తున్నారు.

ఈ మార్గం సాధారణమైన ప్రయోజనాలు భాషలో సారళ్యం ఎక్కువవుండటం ఈ కావ్య మార్గాన్ని దగ్గరిగా తీసుకపోవడం. ఈ వచన కవితా మార్గంలో అంతటా లేదనంగాని అక్కడక్కడా సమాసాదికమైన ప్రౌఢ రచనకూడా ఉన్నది. ఇన్నిటితోపాటు భావకవిత్వ ల్లోంచి వారసత్వంగా సంక్రమించిన అయోమయం యింకా పూర్తిగా తగ్గిపోలేదు. కొందరి వచనపద్యాలలో యిది యెక్కువ కూడా అయింది. తిలక్‌లాంటివారు వచనత్వం యెక్కువగా సంక్రమించిన రచనలను వచనాలుగానే చెప్పుకొన్నారు. కానీ ఈ చిత్రాలో చేర్చలేదు.

రచనలో ఉండే వచనత్వంవల్ల దైనికంగా మనంవాడే పదాలూ, వస్తువులూ, అభివ్యక్తులూ యథా తథంగా దీనిలోకి వచ్చేస్తవి. ఛందో నియమాదులు లేకపోవడంవల్ల వ్యర్థ పదాలు దాదాపుగా రావనే చెప్పాలి. పాదపూరణం అన్న యిబ్బంది అసలే లేదు. భావాన్నిబట్టి వాక్య నిర్మాణం చేసుకోవచ్చు.

వ్యావహారిక వాదం యింతకాలం నుంచి ఉన్నా కవిత్వంలోకి అది రాలేదనే చెప్పాలి. వ్యావహారికంలో పద్యాలు రాయడానికి చేయబడ్డ ప్రయత్నాలుకూడా సఫలం కాలేదు. మాత్రాచ్ఛందస్సుల్లో కిన్నెరసాని పాటలూ, కోకిలమ్మపెళ్లీ వ్యావహారికంలో రచన చేయబడ్డా తరువాత తరువాత వ్యావ

హారిక భాషపోయి మాత్రాశ్రీకవుల కావ్యాలలో గ్రాంథిక భాష జోరబడ్డది. ఈ వచన పద్యం వచ్చి సాధించిన గొప్ప విషయాలలో ఈ విషయం చాలా ముఖ్యమైంది. కృత్రిమ భాషా స్వరూపాలు వాడటం మానేసి సహజములూ సుందరములూ అయిన వ్యావహారిక శబ్దాలు వాడవచ్చు. ఇది వ్యావహారిక భాషా విజయంలో మరోమెట్టు. వచనంలోలాగే వచనపద్యంలోకూడా పరభాషా పదాలుకూడా విరివిగా ప్రవేశిస్తున్నవి. ఇది అంత ఆరోగ్యకరమైన లక్షణం కాదేమో? మన భాషలో అభివ్యక్తి చేయడానికి వీలు లేని భావాలకోసం పరభాషా శబ్దాలు వాడవచ్చుకాని కేవలం చమత్కారం కోసం వాడితే అది భాషకు అపకారం చేయడమే.

ఈనడుమ విశ్వనాథవారుకూడా 'మృత్యుజయు'మనే పేర ఒకరచన చేసినారు. అదికూడా వచన పద్యమేకాని కొన్ని కొన్ని చోట్ల పాదనియమాలూ, యతిప్రాసలూ ఉన్నవి. భాష గ్రాంథికమే.

ఈ కవితా స్వరూపం యింకా సుపరిపుష్టము కాలేదు. ఇదీ కొన్నేండ్లలో అర్హమైన స్థానం సంపాదించుకుంటుంది.

# అంతర్వలయం

—హరిబాబు.

పరికిణీ బొందు ముడివేస్తున్న తల్లి చెంపల్ని రెండు చేతుల్లోకి తీసుకొని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "అమ్మా! నే పెద్ద చదువు చదువుతానమ్మా"— అన్నది కళ్యాణి.

ప్రమీల విస్వేరబోయింది—

* * * *

వారితో తను మొదటి మాటగా ఇదే అన్నది. వారంగీకరించారు. అప్పటికి తన ఆనందం చెప్పలేనంత— . ఇప్పుడెలా పరిణమించిదో....

* * * *

మురళీధరం ఆశ్చర్యపోయాడు. కొత్త పెళ్ళికూతురు. తనతో మాట్లాడదు. చాల సిగ్గుపడుతుంది. ఇంకా.... ఇలానే అనుకున్నవన్నీ ఒక్కసారి త్రోసుకు పోయాయి.

'నేను చదువుకుంటాను'— అన్నది నిస్సందేహంగా నిర్భీతిగా గుండ్రటి కళ్ళను విప్పార్చి అతడిలోకి చూస్తూ. మురళీధరానికి వింతగానే అనిపించింది. ఏమనాలో తెలియకపోయినా— అలానే నీ ఇష్టం— అన్నాడు దగ్గరకు తీసుకొంటూ— . అప్పుడు సిగ్గు గుమ్మరించినట్లు కనబడింది. చక్కగా నవ్వింది. ఆది మురళీధరానికి కొత్త అనుభూతి.

'ఇలా ఎవ్వరూ నవ్వలేరు. ఇది ప్రత్యేకత' అనుకున్నాడు.

కాపురానికొచ్చిన తరువాత ఈ కొత్తదనంలో ఏముందో మెల్ల మెల్లగా అర్థమయింది మురళీధరానికి. కాలేజీ తెరచే రోజుల్లో రోజూ— కాలేజీలో చేర్పించమని— వేధించేది. అప్పటికి సరేనని తప్పించుకో జూచాడు. ఆది నాల్గు రోజులే—. ఆమెను చేర్పించాడు.

కాలేజీనుండి సాయంత్రం ఇంటి కొచ్చి అక్కడి సంగతులు చెప్పేది ప్రమీల. కొత్త పుస్తకాలేమైనా కొంటే ఎంతో ఆనందంగా చూపేది. అన్నిటిపైనా ఆసక్తి చూపేవాడు మురళీధరం.

చిన్నప్పటినుండీ కలసి చదువుకొన్న జనార్దనం కలిస్తే ఈ విషయాలు చెప్పేవాడు. అతడు నవ్వి— అయితే నలభైయేళ్ళ తరువాత రావలసిన మాంఛి అనుభవం ఇవాళే గడించేస్తున్నావన్నమాట — అని మరింతగా నవ్వేవాడు. అతడి నవ్వుకు జతగా నవ్వినా మురళీధరంలో ఒక్కోసారి బాధ స్ఫురించేది.

'నే నివాళనుండి వంట చెయ్యలేను— వంట మనిషిని పెట్టండి'— అన్నది ప్రమీల కొన్ని నెలలు గడచిన తరువాత. పొద్దుట వండి ఇద్దరూ తిని, సాయంత్రం వచ్చి తిరిగి వండుకోవాలంటే చాల కష్టం— చదువు సాగడంలేదని ఫిర్యాదు. 'సరే— ఇప్పటి కెలానో చెయ్యి. వంట మనిషిని కుదుర్చుదాం'— అనేవాడు. అప్పటి కది దాటుగా— ఇలా కొన్ని నెలలు దాటినా అమాంతంగా ఒక్క రోజున 'నే చెయ్యలేదు— చెయ్యలే'నని భీష్మించి పుస్తకం చదువుకొంటూ కూర్చుంది. ఆమె కెదురుగా తనూ చాలసేపు కూర్చుని బయటకు వెళ్ళిపోయాడు.

కారియర్‌తో హోటల్‌నుండి వచ్చినవేళలో కూడ ఇందాకటి స్థితిలోనే కూర్చొని ఉంది. పుస్తక

ధోరణిలో పడితే ఈ ప్రపంచాన్నే మరచిపోతుంది ప్రమీల.

మరునాటినుండీ కుర్రోడొకడు హోటల్ నుండి భోజనం తెచ్చేవాడు. ఇది తెలిసిన జనార్దనం— స్వర్గాని కెళ్ళినా ఏదో తప్పదన్నట్లు— అని గట్టిగా నవ్వాడు.

ప్రమీల ఇంటిస్థితే ఆలోచించదు. ఇది తనకు తెలుసు. పెండ్లికి పూర్వమే ఎవరో 'ఆ అమ్మాయి అదో తరహా. ఎప్పుడూ పరధ్యాన్నం' అన్నారు. నవ్వాడు తను. ఆలోచిస్తూ కూర్చున్నాడు మురళీధరం కటకటాల సందుల్లోంచి పడుతున్న వెన్నెల కిరణాలను పిగరెట్టు పొగను చూస్తూ.... ఆమెను ఆ ధోరణినుండి మళ్లించాలి. గట్టిగా మందలించాలి. కావలసివస్తే చదువు మానిపించాలి. కాని మరో ఆరుమాసాలు ఓపికపడితే డిగ్రీ పుచ్చుకొంటుందది.... అయినా, ఏమాత్రమూ ఇంటిని చక్కదిద్దుకోకపోతే ఎలా? ఇలాగైతే చదువు మానివేయాలిసొస్తుందని గట్టిగా చెప్పాలి. ప్రస్తుతంలో కొన్ని మార్పులైనా రాకపోతే జీవితానికి ఇక సుఖమంటూ ఉండదు. ప్రమీలతో ఇదంతా స్పష్టంగా చెప్పాలి.— మురళీధరం గదిలోకి గబగబా వెళ్ళారు.

గదిలో దీపం వెలుగుతోంది. లోపలికెళ్ళాడు. పడకకుర్చీలో పడుకొని చదువుతూనే నిద్రపోయింది ప్రమీల. గుండెలమీద పుస్తకం జారిపోతున్నది. మెల్లగా చప్పుడుచేయకుండా వెళ్ళి పుస్తకం తీసివేశాడు మురళీధరం. ఆమెను లేపాడు. విసుగ్గా బద్ధకంగా లేచి ఆకన్ని ఊతగొంటూ మంచం దగ్గరకు వెళ్లి పడుకుంది. ఆమెకు దుప్పటికప్పి దీపం ఆర్పాడు మురళీధరం.

మాతృత్వం వహించుతున్నావని తెలియగానే ఏదో అవ్యక్తానందం. తల్లి కాబోతున్నానవే గర్వం స్త్రీకి సహజం. మురళీధరానికి కావనుకున్నట్లుగాక, ప్రమీల వెలతప్పిందని తెలుసుకొని ఏడుస్తుంటే ఆశ్చర్యపోయాడు. డాక్టరొచ్చి చెప్పేదాక కన్నీరు తిరగడం, వళ్ళుతిప్పడం ఎందుకో తెలీలేదు ప్రమీలకు. లెక్కకట్టి డాక్టరు నాల్గు నెలలు దాటాయనుకుంటానని ఉత్సాయింపుగా చెప్పింది. డాక్టరు వెళ్ళగానే భోరుమేడ్చింది ప్రమీల.

కానేమీ ఆమెకు చెప్పలేదు. ఓదార్చ ప్రయత్నించాడు. 'దానికేంచేస్తాం. దేవుడు ప్రసాదించాడు' అన్నాడు. ప్రమీల చీదరించుకుంది. 'ప్రసాదించాడు, నా మొహం ప్రసాదించాడు. నా భవిష్యత్తువంతా పాడుచేసాడు' అంటూ ఏడ్చింది.

ప్రమీల బాధపడడం చూడలేదు మురళీధరం. తనబాధ వ్యక్తం చేయలేదు. ఆమె ఏడ్వడం చూడలేక కిటికీ ఊచల్ని పట్టుకొని నిర్మలంగా, నీలంగా ఉన్న ఆకాశంలోకి చూస్తూ "ప్రమీలా! నిన్ను చేసుకొన్నది జీవితం సుఖమయం చేసుకోవాలని. నిన్ను కష్టపెట్టి నన్ను దుఃఖపరచుకొంటూ జీవించడం నాకిష్టంలేదు. ఇప్పుడంటావా, అనుకోలేదెవ్వరూ. కాని ఒక్కటిమాత్రం నిజం. ఈ స్థితే వేరొక్క కాక పూర్వం ఊహించుకొని ఏదో మధురానుభూతి కలుగుతుంది గామోసు అనుకునేవాడిని. కొరకు ప్రపంచంలో ఇది ఆనందహేతువు. నీవేమో...." ఇంకా ఏదో చెప్పబోయాడు. అతడికంఠం రుద్ధమైంది.

ప్రమీల లేచివచ్చి అతడి భుజంపై తల ఆన్చి 'నాకు చదువు సాగదని బెంగ.... అంతే' అన్నది. మురళీధరం ఆమెచెక్కిళ్ళపై నీటిధారలను తుడుస్తూ 'లెక్కవేస్తే పరీక్షల తరువాతనేగదా ప్రసవం' అన్నాడు. ఆమె నవ్వింది. అతడు కరగిపోయాడు. అది ఆమెలోని ప్రత్యేకత.

పరీక్షలు జరుగుతున్నాయి. మురళీధరం అడిగేవాడు 'ఇవాళ ఎలా వ్రాసావు' అని. అతడిలోకి సూటిగా చూసేది ప్రమీల. ఏదో ఎలానో 'నా తలకాయలా వ్రాసాను' అనేది ఆయాసంగా. వినిన

వేళలు. మురళీధరం కళ్ళుమూసుకొని ఏదో భగవంతుని ప్రార్థించేవాడు.

పరీక్షలన్నీ ముగిసిన పదిరోజులకు ప్రమీల ప్రసవించింది. 'కళ్యాణి'అన్నాడు మురళీధరం. ఇక కళ్యాణిని చూసుకొంటూ ప్రమీల మారిపోతుందని ఆశ. జనార్దనానికీ ఇదే చెప్పారు. అయితే ఈ పేరు బాగోలేదురా, మరోపేరు ఎంచు అని గట్టిగానవ్వాడు. మురళీధరమూ ఆనందంగా చక్కగా నవ్వుతున్నాడు.

యూనివర్సిటీ ఫస్టు రాకపోయినా, ఫస్టు క్లాసులో స్థానయింది. ఫలితాల సంగతి చెప్పటానికి గదిలోకి వెళ్ళాడు. పాపాయికి పాలుపడుతోంది. పేపరు చూపాడు. పట్టేపాలు ఆవలపెట్టి పేపరును ఆసక్తితో చూసింది, పాపాయి కేరు కేరున ఏడుస్తున్నా లెక్కచేయకుండా. మురళీధరం మనస్సు చివుక్కుమంది. నెంబరు ప్రమీలకుచూపి, పాపాయికి తానే పాలుపట్ట ప్రయత్నించాడు. పాపాయి తాగకుండా మొండిగా ఏడ్చింది. ప్రమీలకు తాను పాసయ్యాననే ఆనందంలో ఇవేమీ పట్టలేదు.

నెలన్నర బాలింతరాలు, యం. యస్ సి లో చేరుతానంది. మురళీధరం నిర్ఘాంతపోయాడు. వద్దన్నాడు ధైర్యంచేసి. రెండురోజులేడ్చింది ప్రమీల చిన్నపిల్లలా.

మురళీధరం నచ్చచెప్ప ప్రయత్నించాడు. ఆరోగ్యం చెడుతుంది. కావాలంటే వచ్చేసంవత్సరం చూడొచ్చు. జనార్దనంకూడా అదేమాట అన్నాడు మందలిస్తున్నట్లు. ఏ ఆరోగ్యం అపాటిదే. కళ్యాణికి సంవత్సరం పూర్తయితే ఏ పనికత్తెనైనా ఉంచవచ్చుగా — అన్నాడు. ఆ సాయంత్రం ప్రొఫెసర్ ఇంటికెళ్ళారు దంపతులు పాపతోసహా. అతడికీ మురళీధరం సలహా నచ్చింది. వచ్చే సంవత్సరం సీటుకు తాను హామీఅన్నాడు. పాపను ముద్దాడి దంపతుల్ని దీవించి వెళ్ళమన్నాడు. ఆ ముసలాయన హామీ మీద ఊరుకొంది ప్రమీల.

మురళీధరానికి కళ్యాణిదే లోకమయింది. మారిపోతుందనుకొన్న ప్రమీల ఏ మాత్రం మారలేదు. సబ్జక్టు మరచిపోతానేమోనని భయం. పుస్తకాలు తిరగవేస్తూ తన ప్రపంచం వీడి ఈవలకు వచ్చేదికాదు.

కళ్యాణికి కించిత్ బాధకల్గినా సహించలేడు మురళీధరం. ప్రమీల వల్ల తనకేసాన్నిహిత్యమూ లభించలేదు. ఆమెఉన్నా తను వంటరిగాడేనన్నట్లు వుండేవాడు. 'ఆమె ధోరణివేరు. ఆమే వేరు. ఆమెదో ప్రత్యేకత' అనుకునేవాడు. ఇప్పుడు కళ్యాణి అతడికి తోడు.

తను తారంగం తిప్పితే గ్రహించినట్లు కళ్యాణి చేతులు తిప్పేది. ఉప్పొంగిపోయేవాడు. పాలు తాగుతున్నదల్లా తన మాటవింటే మానివేసి కాళ్ళూ, చేతులూ ఎగరవేస్తూ కేరింతలు కొట్టేది. మహదానందమయ్యేది మురళీధరానికి.

చాపమీద పడుకున్నదల్లా ఆఫీసునుంచి రాగానే చేతులు కాళ్ళూ కొట్టుతూ కేకలువేసేది. కళ్యాణి బూట్లువిప్పే అలస్యంకూడా సహించేది కాదు. తననుచూస్తే - ముందు ఎత్తుకొని అలానే బూట్లు విప్పుకోవాలి.

సంవత్సరం ఎప్పుడు తిరుగుతుందా అని చూసే ప్రమీల మళ్లీ కాలేజీలు తెరవగానే యం. యస్ సి. లో చేరింది. పొద్దుటే ఒక బ్రాహ్మణ అనాథ వస్తుంది. వంట చేస్తుంది. కళ్యాణిని సాయంత్రందాక చూస్తుంది. ప్రమీల కాలేజీనుంచి రాగానే వంటచేసి వెళ్ళిపోతుంది. మురళీధరం వచ్చిన తరువాత ఇంత అన్నం మెదిపి కళ్యాణికి తినిపించి ఇద్దరూ భోజనానికి కూర్చుంటారు.

తను ఆఫీసుకెళ్ళేప్పుడు కళ్యాణి మెల్లగావచ్చి కటకటాలను పట్టుకొని నిలబడి కళ్ళూ, ముక్కూ, మూతి ఆ చిన్న సందుల్లో ఉంచి, 'ఏయ్' అంటూ

చిన్నారిచేతిని ఓనందులోంచి బయటకుపెట్టి ఊపుతూ వీడ్కోలు చెప్పే దృశ్యం ఆఫీసునుండి తిరిగి వచ్చే వరకు నెమరు వేసుకొంటుండేవాడు.

కళ్యాణికి 'అమ్మా' అనే పదంకన్నా 'నాన్న' అనే పదమే ముందు వచ్చిందనుకుంటాడు మురళీధరం. భోజనంచేసి తను వరండాలో అటూ ఇటూ తిరుగుతుంటే కళ్యాణి తనతో తనలా వడవడానికి తప్పటడుగులేస్తూ తిరగటంచూసి మురిసిపోయేవాడు మురళీధరం.

తన చదువులోంచి కొద్దిగా తీరుబాటు చేసుకొని తండ్రి కూతుళ్ల ఆటలు, ఆనందంచూసి తను అనుభవించలేని క్రొత్తఆహ్లాదం ఏదో వారిలో ఉందనుకొని నిట్టూర్చి తన ప్రపంచంలో తిరిగి పడిపోయేది ప్రమీల.

—ఇంతలా ఉన్నవారు కళ్యాణిని ప్రమీలకు వదలాల్సివస్తుందని మురళీధరం — తను కళ్యాణిని ఇంతలా చూసుకోవాల్సివస్తుందని ప్రమీల, అనుకోలేదు—

మొదటి సంవత్సరంలో బాగా మార్కులు వచ్చినా ఈ ఆఖరు ఏడులో విశ్వవిద్యాలయంలో తాను మొదటిదిగా రావాలని దీక్షగా చదువుతోంది ప్రమీల.

వర్షాలు అంతమయ్యే రోజులవి. కురిసేది ఈ ఒక్కరోజునేకదా మళ్లీ సంవత్సరందాక కురుసేదుందా అనుకొన్నట్లు కురుస్తోంది వర్షం. మరో అరగంటలో ఆఫీసులు వదలుతారనగా పట్టింది. మురళీధరానికి మనసులో మనసులేదు. ఆవేళ పిల్లను చూసే సీతమ్మగారు రాలేదు. ప్రమీలను బ్రతిమాలగా- బ్రతిమాలగా ఇంట్లో వుండటానికి ఒప్పుకొంది విసుగ్గా. కాని కళ్యాణిని జాగ్రత్తగా చూస్తుందనుకోలేదు. చదువుతూ తన లోకంలో తానుంటుంది.

వర్షం ఒక గంట తరువాత తగ్గుముఖం పట్టింది. ఇక ఆగలేకపోయాడు. తడిస్తే తడిపోవని బయలుదేరాడు.

అనుకున్నంతా అయింది. డాబాపై నుండి నీళ్ళుజారే నీటి గొట్టంక్రింద చేరి ఆడుతోంది కళ్యాణి. పూర్తిగా తడిసి ముద్దయి ఉంది. తండ్రిని చూడగానే పరుగునవెళ్ళి కాళ్ళకు చుట్టుకుంది.

వ్రాసుకుంటున్నదల్లా తలెత్తి చూస్తే ఎదురుగా తండ్రి కూతుళ్ళు తడసి ముద్దయి ఇంట్లోకి వస్తున్నారు. ప్రమీలవంక ఒకసారి చూసి చూడనట్లు లోపలికివెళ్ళి కళ్యాణి బట్టలు తీసివేసి తల తుడుస్తున్నాడు. ప్రమీల వచ్చింది. ఇద్దరూ వర్షంలో తడుస్తూ ఎక్కడికి వెళ్ళారు? అన్నది. మురళీధరం మాట్లాడలేదు. ఏదో అనాలనుకొంటున్నా, మాట పెకలిరాలేదు. కండ్లునిండినయి. కళ్యాణికి బాగా తుడిచాడు.. తనూ తుడుచుకొంటున్నాడు. ప్రమీల అలాచూస్తూ నిలబడింది. మురళీధరం ఎందుకు మాట్లాడలేదోకూడా ఊహించలేకపోయింది. కళ్యాణికి బట్టలైనాతీసి యివ్వలేదు. మురళీధరమే బట్టలు వేస్తూ "తప్పమ్మా - అలా నీళ్ళల్లో ఆడకూడదు తప్పు" అన్నాడు. 'మరి లాలో?' అంది కళ్యాణి. పక్కన నవ్వింది ప్రమీల. మురళీధరం గంభీరంగా ఓసారి ప్రమీలవంక చూసి, 'లాలమంచిదే' అన్నాడు కళ్యాణితో. తల్లి ఎందుకు నవ్విందో అర్థంకాక తండ్రి వళ్లోకివెళ్ళి 'లాల మంచిదా?' అనడిగింది అనుమానంగా. "ఆ — మంచిది. రోజూ లాలోసుకోవాలి" అన్నాడు మురళీధరం.

వర్షంలో కళ్యాణి ఎంతసేపు తడిసిందోఏమో అర్ధరాత్రికి వళ్ళు వేడిగా అయింది. వంటికి యూక్లిప్టస్ ఆయిల్ రాసి రెండుచుక్కలు పంచదారలో వేసి తినిపించాడు. అయినా పొద్దుటకు బాగా జ్వరం వచ్చింది. మురళీధరం తెల్లవార్లూ ప్రక్కప్రక్కన కూర్చొనుండటం ప్రమీల రెండు మూడు

పార్లు చూసింది. పొద్దుటే 'రాత్రి మీరు నిద్రపోలేదా' అనడిగింది. కళ్యాణికి జ్వరంవచ్చిందని సమాధానమిచ్చాడు. డాక్టరును పిలిపించండి— అన్నది.... అంతే.

ఆరోజు సీతమ్మగారికి కబురుచేస్తే వచ్చింది, జ్వరంతో—. వంట చేయకపోయినా పిల్లదాన్ని చూస్తానన్నది. డాక్టరువచ్చి మందిచ్చివెళ్ళాడు. ప్రమీల ఈ ఒక్కరోజుకు వంట చేయమనడగడం ఎందుకని క్రితం రోజులానే హోటల్‌నుండి కారియర్ తెచ్చాడు.

సాయంత్రానికి జ్వరం తగ్గింది కళ్యాణికి. సీతమ్మగారికి జ్వరం ఎక్కువైంది. మరునాడు రానని వెళ్ళిపోయింది.

శనివారం క్లాసులులేవు. ఇంట్లోనే ఉండిపోతానంది ప్రమీల. వంటకూడా తనేచేసింది. వెళ్తూ కళ్యాణిని జాగ్రత్తని చెప్పటానికి జంకాడు.

సాయంత్రం రావటం కొద్దిగా ఆలస్యమయింది. వచ్చేసరికి వరండాలో ఎదురయ్యే కళ్యాణి లేదు. ప్రమీల వ్రాసుకొంటూంది. ప్రక్కమీదా లేదు కళ్యాణి. మురళీధరం గుండెలు కొట్టుకున్నాయి. 'కళ్యాణీ!' అని కేకవేశాడు. 'నాన్నా' అంటూ సమాధానం నీళ్ళ గదిలోనుండి వచ్చింది. ఒక్క దూకుడుగా వెళ్ళాడు. కళ్యాణి చిన్న చెంబుతో నీళ్లు ముంచుకు నెత్తిన పోసుకొంటూంది. నిన్న జ్వరం ఇవాళ ఇలా తడసిపోయింది. మురళీధరం నిలువెల్లా కంపించిపోయాడు.

“లాల నాన్నా—” అంది కళ్యాణి. ఏనాడూ కళ్లతోగూడా బెదిరించని కళ్యాణిని చెళ్ళున చెంప మీద కొట్టాడు. కెవ్వుమంది, గట్టిగా కావులించుకున్నాడు. కళ్లనిండా నీళ్లు తిరిగాయి. తీసుకవెళ్లి తువాలుతో తుడుస్తున్నాడు.

ప్రమీల పిల్లఏడుపువిని లోపలికి వచ్చింది. ఏం జరిగింది?” అనడిగింది మెల్లగా. మురళీధరం కోపందిగమింగలేకపోయాడు. ఏనాడూ పల్లెత్తుమాట ప్రమీలననలేదతడు. ఏం జరిగినా, ఏంచేసినా తనే సర్దుకుపోయేవాడు. ఇక కోపం పట్టలేక పోయాడు.

సూటిగా ఆమెలోకి చూసాడు. “నా శ్రాద్ధం. ఏంజరగాలి? ఏం జరిగితేనేం నీకు. ఒక్కగానొక్క చంటిది. దీన్ని ఒక్కరోజూ చూసుకోలేకపోయావు. నీ చదువు నిన్నెప్పుడొదుల్తుంది. అది దయ్యంలాపట్టింది. దీనిసంగతి ఇంకెప్పుడుచూస్తావు నువ్వు? నే చచ్చిన తరువాతగాని ఇవేమీ నీకు పట్టవేమో. పో - నీ చదువులోంచి బైటకురాకు. పో- నా ఏడుపేదో నే నేడుస్తాను” అన్నాడు.

ఇలా ఎప్పుడూ మురళీధరం మాట్లాడలేదు. అతను మాట్లాడుతూన్నంతసేపూ వణికిపోతున్నాడు. కంఠం కంపించింది. అతని కళ్లల్లో నీళ్లు పొంగాయి. తుడుస్తున్న తువాలుతో కళ్లొత్తుకున్నాడు.

ప్రమీల మ్రాన్పడి అలానే ఉండిపోయింది. ఈ మాటలేమి అర్థంకానట్లు పిచ్చిదానిలా శూన్యంగా చూస్తూ ఉండిపోయింది.

తండ్రి ఇలా గట్టిగా మాట్లాడటం, కన్నీళ్లొత్తుకోవడం, తల్లిరాపడి పోవడంచూసి కళ్యాణి తన ఏడుపు మానివేసింది.

మురళీధరం పాలుకాచి పిల్లదానికి త్రాగించి పడుకోబెట్టి ప్రక్కనే కూర్చుండిపోయాడు. ఆ రాత్రి ప్రమీలకు గాని, మురళీధరానికిగాని భోజనపు ఆలోచనే రాలేదు.

వరుసగా నాల్గురోజులు ఉద్ధృతంగా జ్వరం వచ్చింది. కళ్యాణి ప్రక్క పక్కనుంచి కదల్లేదు మురళీధరం. సీతమ్మగారుకూడ రాలేదు. ఈ నాల్గురోజులు మురళీధరం పచ్చి మంచినీళ్లుకూడ ముట్టలేదు. ప్రమీలకు మురళీధరంతో మాట్లాడాలంటే భయం భయంగా వుంది. ఆవలి గదిలో కూర్చుండి ఎప్పుడైనా ఒకసారి అలాచూసి పోతుండేది.

ఐదో రోజు కళ్యాణి జ్వరం తగ్గింది. సీతమ్మ వచ్చింది. వాళ్ళని చూడగానే మురళీధరానికి ప్రమీలకు ప్రాణాలు లేచివచ్చాయి. కళ్యాణి ముఖం విప్పారింది.

ప్రమీల చాటుగా సీతమ్మకు నాల్గు రోజుల్నుంచి మురళీధరం అభోజనంగా ఉన్నాడని చెప్పింది. సీతమ్మకు ఈ దంపతులమధ్య వుండే పొత్తు తెలుసు. వంటచేసి 'బాబూ! స్నానంచేసి భోజనానికి లేవండి' అంది. మురళీధరం ఆమెవంక చూసాడు. 'అమ్మాయి దగ్గర అమ్మాయిగా రుంటారు లెండి'— అన్నది. అలానే కూర్చొని కళ్యాణిని చూస్తూ ఉన్నాడు. 'పర్వాలేదు బాబూ' అన్నది.

మురళీధరం లేచి వెళ్లాడు. ప్రమీలవచ్చి అతడు లేచి వెళ్ళిన స్థానంలో కూర్చొంది. కల్యాణి తల్లిచేతిని తన గుండెల మీదకు తీసుకొంది. ప్రమీల వంగి కళ్యాణిని ముద్దుపెట్టుకుంది. అలానే తల ప్రక్కన పెట్టుకొని చూస్తూ ఉండిపోయింది. తల్లి తనకింత దగ్గరగా రానేలేదెప్పుడూ. కల్యాణి రెండుచేతులూ తల్లిమెడ చుట్టూవేసి కరచుకొని కళ్లు మూసుకుంది. భోజనం చేసివచ్చిన మురళీధరం ఆ దృశ్యాన్ని చూచి చాల ఆనంద పడ్డాడు. తల్లికున్న సహజ లక్షణం ఎక్కడ పోతుంది, అనుకున్నాడు.

కళ్యాణి పూర్తిగా జ్వరం తగ్గిన తరువాతనే మురళీధరం ఆఫీసుకెళ్ళాడు. రాత్రులంతా మేలుకోవడం. పగలు నిద్ర పట్టక పోవడంతో చాలా నీరస పడ్డాడు. పనిచేయలేక మధ్యాహ్నమే తిరిగి వచ్చాడు. కళ్యాణి ఆడుకొంటుంది. తనూ ఆ పిల్లతో కూర్చొన్నాడన్న మాటేగాని వంట్లో నలతగా ఉన్నట్లుం దతడికి.

రాత్రికి బాగా జ్వరం వచ్చింది. లెక్కచేయలేదతడు. పొద్దుటకు బాగా ఎక్కువయింది. సాయంత్రానికి మాటమూడు నుండి క్రిందకురాలేదు. సీతమ్మగారే అన్ని పరిచర్యలు చేయడం. ప్రమీల దగ్గరకు రావాలంటే భయపడుతుంది.

డాక్టరు టైఫాయిడ్ అన్నారు. పక్కమీద నుండి తిరిగిలేచేవరికి నెలరోజులైంది.

వద్దంటున్నా వినకుండా ఆఫీసు కెళ్ళాడు. తిరగబెట్టింది జ్వరం. ఈసారి సీతమ్మతో తీరేట్లు లేదు. జనార్దనానికి కబురు చేసాడు. అతడు పత్నితో సహా వచ్చాడు. మురళీధరం స్థితి చూసి నివ్వెరపోయాడు. ప్రమీల కిదేమీ అర్థంకావడం లేదు. తండ్రి జ్వరంలో ఉన్నాడు గనుక కళ్యాణి తల్లి దగ్గరే ఎక్కువగా చేరేది. ఈ పరిస్థితుల్లో కూతుర్ని గట్టిగా గుండెకు హత్తుకొని పడుకొంటే గాని నిద్రపట్టేదికాదు ప్రమీలకు.

నానాటికి తీసిపోయాడు మురళీధరం. ఇక బ్రతుకుతానని ఆశపోయింది. తను దుఃఖించేది కళ్యాణి గూర్చి. ప్రమీల ఎలాచూడగలదనే బెంగ. జనార్దనంతో ఈ మాటే అంటే కోప్పడేవాడు.

ఒక రోజు పొద్దుట జనార్దనం లేనప్పుడు, జనార్దనం భార్య వంటింట్లో ఉన్నప్పుడు ప్రమీలను పిలిచాడు. పక్కన కూచోమన్నాడు. బ్యాంకులో డబ్బు కొద్దిగా ఉందని, ఇన్సూరెన్సు తాలూకు ఓ ఎనిమిదివేలు వస్తాయనీ, అది కళ్యాణి పెండ్లికోసం బ్యాంకులో వేయమని, ఎలానో క్లాసులో పాసవుతుంది గనుక ఉద్యోగం చేసి కళ్యాణిని చాల జాగ్రత్తగా పోషించమంటూ ఏవేవో చెప్పాడు. ప్రమీల చెక్కిళ్ళపై జారే కన్నీటిని తుడుస్తూ తను కండ్లు నీళ్ళు పెట్టుకున్నాడు.

ఆరోజు మధ్యాహ్నం కళ్యాణి నిద్రలో భయపడుతున్నట్లు లేచి, నాన్నా అంటూ తండ్రి మంచం దగ్గరకు వెళ్ళి మురళీధరాన్ని కావులించుకొని ఏడవ సాగింది. సీతమ్మగారు జనార్దనం భార్య పిల్లదాన్ని పక్కకు తీసివేసారు. మురళీధరం బిక్కమొహంతో చూస్తూ వుండిపోయాడు. ప్రమీల కళ్యాణితో సహా ఏడుస్తూ వుంది. సీతమ్మగారు ప్రమీలను మందలించారు.

సాయంత్రానికి ఆయాసం ఎక్కువయింది మురళీధరానికి. ఆరోజు విషమదిన మని డాక్టరు చెప్పనే చెప్పాడు. జనార్దనం డాక్టరుకోసం పరుగెత్తాడు.

సంధ్యవాటారింది. మూలల్లో చీకట్లు ముసురుకుంటున్నాయి.

ప్రమీలను కళ్యాణిని దగ్గరకురమ్మని సంజ్ఞ [illegible]డు మురళీధరం. ఇద్దరిచేతులూ ఒక్కటిగా [illegible] తనగుండెలపైకి చేర్చుకున్నాడు. కళ్యాణి ఇక నీ ఒక్కదానిదే అన్నాడు నీరసంగా. ఇంకా ఏదో చెప్పాలనుకున్నాడు. ఆయాసం మాట్లాడ నివ్వలేదు. సీతమ్మగారు దీపం వెల్గించారు. ఆ వెలుగులో ప్రమీల కళ్యాణి ముఖాలు తృప్తిగాచూసి దీర్ఘ శ్వాస వదిలాడు. మురళీధరం.

సీతమ్మగారు పూర్తిగా దుప్పటి కప్పింది. ప్రమీల అలానే కుప్పగా కూలిపోయింది. తల్లిని చూసి బావురుమంది కళ్యాణి.

* * *

అప్పుడు తెలిసింది వారి లేమి. కళ్యాణిని ఎలా సముదాయించాలో తెలీక మొదట్లో చాల బాధ పడేది. కళ్యాణి 'నాన్న ఏరీ?' అంటే ఏం చెప్పాలో తోచక ఏడిచేది పిల్లను గట్టిగాహత్తుకొని. కళ్యాణి తనచుట్టూ చేతులువేసి 'సీతమ్మత్త చెప్పిందిలే నాన్న దేవుడి దగ్గర కెళ్ళారుటగా! ఏడవకమ్మా మళ్ళీ తిరిగొస్తారుగా' అనేది కన్నీళ్ళు తుడుస్తూ. కళ్యాణి ఏదైనాపేచీపెడితే తను సర్దలేక ఏడుస్తుంది. వెంటనే కళ్యాణిపేచీ మానివేస్తుంది. రోజూవారి పటంముందు మోకరిల్లి కళ్యాణికి ఏలోటూరానీయ నని దానికోరికేదైనా సాధ్యమైనంతవరకు తీరుస్తానని చెప్పుకొంటుంది తను —

* * *

"ఏమమ్మా! నీలా పెద్ద చదువు చదువుతా నమ్మా..." తిరిగి అన్నది కళ్యాణి.

"తల్లీ!" అంటూ గుండెకు గట్టిగా హత్తుకుంది ప్రమీల.

## రచయితలకు —

తమ రచనలను ప్రతినెల 10 వ తేదీలోగా కార్యాలయమునకు పంపవలయును. తిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్లలు జతపరుప వలయును.

—సం. జ.

# అద్దంలో నీడలు | మాదిరాజు రంగారావు

తూరుపుటద్దంలో ఒక చివర బింబించిన
నా ముఖం గుర్తించి గుంపులు గుంపులుగా
పురాణ పురానివాసస్థలం వదలి అంతలో
దూరాకాశ తీర భూములు చేరిన భూతాలు

రువ్వబడిన రాళ్ళవలె కేరింతలతో రివ్వున
ఎప్పటికప్పుడు నా మస్సు నాక్రమించాలని
ఏదో వేషంతో తిరుగు మృతభావనా మూర్తులు
వెల్గులారి కొడిగట్టిన వత్తుల ప్రమిదలు

భూతాల సమావేశంలో ఏకగ్రీవంగా
ఆమోదింపబడిన తీర్మాన పాఠం
హిమ బిందు రూపంలో అంతటా
ప్రకటింపబడిన సమీకరణ పత్రం

చదవడానికి యత్నించు చెట్ల గుంపులు
చేతులు చాచి చెరపివేయ ఉత్సహిస్తూ
పసిమి చిందు ముఖాలతో చుట్టూ ఎగబ్రాకు
వను పట్టుక ఊగులాడు వెలుగు కెరటాలు

* * * *

ఆకాశం నుండి భూమివరకు సాగిన వెలుగు వంతెన
వెలుగు వంతెనపై సశబ్దకంగా నడిచే మనుషులు
ఒక దిశనుండి మరోదిశకు సాగు గాలివంతెన
సగం నిద్రలో నిశ్శబ్దంగా నడిచే మబ్బుగములు

భూమిపై వేల ఏండ్లుగా శిలాకృతుల రూపంలో
శాప వశాన పడిఉన్న ఊహాగత సౌందర్య జీవులు
క్షుధాగ్ని కలుగని వ్యధార్త మెరుగని
శాంత భావనా రమ్య శిల్ప దీప శిఖలు

ఈ దీపశిఖల నీడల గొలుసులు పట్టుక తిరుగు
పొగ క్రమ్మిన అరమూత కనుల రాత్రించరులు

తెరవబడిన కనుల త్రాగి అమృతపు వెలుగులు
ఈ దీపశిఖల నాశ్రయించి బ్రతుకు దివౌకులు

* * * *

ఎన్నో ఏండ్ల గ్రహాణంనుండి విడిపించి నభోమణిని
భూమిని ఆకాశాన్ని రెండు ముక్కలుగా వేరుపరచి
మరుద్గణంతో దుస్థితి పారద్రోలి సుస్థితి కల్పించు
—శచీపతి

దేవతలకు మానవులకు చాల దగ్గరి బంధువు
హిరణ్య వర్ణ జాతవేద ప్రథమ పవిత్రమూర్తి
ప్రతి ఉదయం జన్మించు, మృత్యూపచయ మెరుగని
—కవిక్రతువు

సవితృబింబ నేత్రంతో సర్వం పర్యాలోకనచేస్తూ
హస్త నిహిత పాశంతో పవమాన నిశ్వాసాలతో
సువర్ణ పత్రాలతో వెలుగు క్షమామూర్తి
—ధృతవ్రతుడు

ఎంత పలుకరించినా పలుకకుండా
ఒకటి రెండు మాటలైనా సరే నాతో

అహంకారం, అంధకారం, అశాంతి
ఆవరించిన ఆవరణంలో అస్పష్టంగా

భూమిపై నీడలు కల్పించేటంత ఎత్తులో
సంభాషణలు జరుపుతూ గాలులతో

కదలిపోవు జ్యోతిర్మయ ప్రతీకలు
ఇంద్రాగ్ని వరుణ దేవతా మధు మూర్తులు

* * * *

తూరుపు టద్దంలో మరీచివగ బింబించిన

వికసన్మృదూజ్వాల వదన ప్రాభాతసరసి
నిరంతరం ఝరిపోస్తూ కదలిపోవు
మృదు సుస్వర నాద వాయు పరిమత్తులు

విశ్వాసంతో సురభిళ నిశ్వాస పవన
వీచికలతో ఎదురువచ్చు చాంద్రీ హాసంతో
రోదసీ సమాక్రాంత మృదుల వతాకాశంవలె

తూరుపు టద్దంలో బింబించిన నా ముఖంలో
లీనమై, స్నిగ్ధ నేత్ర పరినీల పయోనిధి
ఇంద్ర ధనూ రజ్యమాన మృదులాశా కపోలపాళి

సంధ్యాకాల ముద్రలు స్ఫురించని ముఖం
చీకటి ముళ్ళు కన్పించని నీలి వెలుగు కళ్ళు
ప్రాణ దఘ్నంగా ముంపుగా సాగిపోవు
చాంద్రీ స్నిగ్ధ పరిమళ వాయూర్మిక

అప్పుడప్పుడు అనూహితంగా నా మనస్సు ఒరసుకుంది
దూయబడిన కత్తి పోట్లకు గాయపడిన చిరునవ్వుతో
ఈ గీతం రూపంలో మలగిన తుషారదీధితి
పెదవులు సంస్పృశించి కదలు నవనీతాకృతి

బహుపూర్వ జన్మా రహస్య సౌందర్యాలను
వేదనారూపంలో స్మరింపజేయు జీవగత చైతన్యము
జీవనాడులను వాయుతంత్రులవలె స్పందింపజేయు
దేవతా భావము రూపుకట్టిన సజీవ శిల్పాకృతి

రమ్యబుద్ధి, వెన్నెలల మృదూష్ణాల ఊహలతో
గగన మండలం వాయు పథం భూవలయం
సత్వభావ రమణీయతా సీమలుగా మార్చు
మనోదశ దాటిన ఆత్మ భావనాంబుధి చంద్రుడు

అద్దంలో చూస్తే కన్పించి ముఖంలో ముఖం పెట్టి
అద్దం తీసివేయగనే ఊహను సమాక్రమించి
సుషుప్తిలో – ఉపాధి నాశ్రయించని–
ఆత్మలో సంవిలీనమా ఆనంద రసాకృతి.

# ఉత్తరరామ చరిత్ర-ప్రథమాంకము

రాళ్లబండి సుందర సుదర్శనాచార్యులు.

పదవాక్య ప్రమాణ తత్త్వజ్ఞుఁడైన భవభూతి యీ నాటకములో ప్రథమాంకమును మలచుటలో ననన్యమైన నేర్పు చూపించియున్నాఁడు. ఇది యాతని యపారమైన శిల్ప శక్తికి నిదర్శనము. తృతీయాంకమునందు వలెనే యిందులోను నాతఁడు ఉత్తమ నాటక రచయితగా తన ప్రతిభను ప్రదర్శించి యున్నాఁడు. అంతే కాదు. నాటక ప్రయోక్తగా తన కున్న అనుభవమును బాగుగా వాడుకొనినాడు. విశిష్టమైన ప్రయోజనములను సమకూర్చు ప్రస్తావనను రచించుటయు, చిత్రపట సందర్శనమును సన్నివేశమును కల్పించుటయు నీ రెండును పై సుగుణములను సువ్యక్త మొనర్చిన సుందర భాగము లనవచ్చును.

ప్రథమమున ప్రస్తావనను గైకొని పరిశీలింతము.

సంప్రదాయానుసారముగా నాటకారంభమునందు నెఱుపవలసిన కార్య మిది. కేవలము కథను, కవిని, ప్రేక్షకులకుఁ బరిచయము చేయుటకుగా మాత్రమే యిది యుద్దేశింపఁబడలేదు. ఇది సాధించు ప్రయోజనము లింకను చాలఁ గలవు.

నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి నాటకకర్తనూ, రూపక రామణీయకత్వమునూ గూర్చి ప్రేక్షకులకుఁ బరిచయము చేయును. తా నయోధ్యావాసిగా మారినట్లారోపించుకొని శ్రీరామచంద్రుని పట్టాభిషేకోత్సవ సమయమునం దానంద నాందీవాదములచే ఘూర్ణిల్లిన ముంగిళ్లన్నియు సందడి గోల్పోవుటేలనో! యని సంశయించుచుండగా నటుఁ డప్పుడు ప్రవేశించి మహోత్సవము ముగిసినదని, యతిథు లందఱును వెళ్లిరని, ఋష్యశృంగులవారి క్రతువునకై నిండుచూలాలగు సీతాదేవిని విడచి రాణులు, పెద్దలు, వెళ్లిపోయినట్లు చెప్పును. తడవు చేయుటేల! రాజద్వారమున నిలిచి స్వజాతి మర్యాదతో స్తోత్రపాఠములను చేయుదము రమ్మని సూత్రధారుఁడు నటుని నాహ్వానించును. వాఁడును, ఏలినవారికై పరిశుద్ధమైన స్తోత్రప్రస్థానిని గూర్పింపు మనును. అనుభవపూర్ణుఁడగు సూత్రధారుఁడు 'పరిశుద్ధమను మాటయేల? వనితలందును వాక్కులందును, సాధుతావిషయమున జనులు దుర్జనులు' అని చెప్పును.

అటు పిమ్మట సంవాదము— వైదేహి మీఁదనే దురపవాదము వచ్చినట్లును, రాజు చెవి నది పడినచో మిక్కిలి కష్టము సంభవించుననియు, అయినను దేవతలును, ఋషు

లును మేలు చేయుదురనియు తెలియును. ఆ సమయములో జనకుని యెడబాటుకై దిగులు చెందుచున్న సీతాదేవి నోదార్చుటకై అంతః పురమునకు ప్రభువు వెళ్లుచున్నట్లుగా జన మనుకొనుచున్నదని సూత్రధారుఁడు చెప్పును. ఆతర్వాత సీతారాములు ప్రవేశింతురు.

ఈ ప్రస్తావన నాతివిస్తృతమైనను ఎన్నియో ప్రయోజనములను సాధించునదిగ నున్నది.

సూత్రధారుఁడును, నటుఁడును, వీరి యూరు సంవాదములలో కథాసంవిధానము నకు సంబంధించు విషయములెన్నో కలవు. ఉపోద్ఘాత రూపమగు విషయమునం దిచ్చు టయే కాక కథా సందర్భమున కనుగుణమగు వాతావరణమును గల్పించుటలో నిది ప్రముఖ పాత్రి వహించునదిగ నున్నది. కావ్యమున విషాదమే విపులముగాఁ బోషింపఁబడఁబోవు నని ధ్వనింపఁజేయు భాగమిది. లోకోత్తర చేతస్కులగు మహాత్ముల గంభీర జీవిత స్రవంతులలోనుండు మాధుర్యమునేకాక సామాన్య మానవులకు కనరాని, ఊహింప నలవికాని వారి హృదయాంతర్గత విషాదమును స్పష్ట పఱచు భాగమిది.

సంకుచితమగు లోకుల తీరు—ముఖ్య ముగా సాధుతావిషయమున దుర్జనత్వముగల జనుల తీరును ఇది చక్కగా పోషించుచున్నది. రాము డప్పుడే రాజ్యాధికారమునకు వచ్చి నాఁడు. రాజ్యమునకా క్రొత్త; పాలనాను భవమా! ఇంకను సంపూర్ణముగా సంతరించు కొనవలసియున్నది. అయినను అందుకు కావ లసిన శ్రద్ధయును బాధ్యతలను నిర్వహించు టలో గల గౌరవమును, రామునిలో మిక్కు టముగా నున్నవి. అందువలన నాతఁడు ధర్మముకోస మేదైనను త్యజించుటకు సిద్ధ ముగా నున్నాఁడు. సీతాదేవిపై పుట్టిన ప్రవాదము నాతఁడెఱింగినచో ననూహ్యమైన ఫలితముల కది దారితీయును. కారణము— అప్పటి కతఁడు రాజ్యమునకు క్రొత్త. అంతః పురములో రాణులును, పెద్దలును లేరు. అంతయు నతని యధికారములో— పెత్తన ములో— నున్న సమయము. ఇదియే నాయ కుడగు సీతనిని బరీక్షించుటకు సమయము. ఇట్లు భవభూతి తన నాయికా నాయకులను పరిచయము చేయుతీరులోనే యొక గొప్పదన మున్నది. సీత నూరడింపఁబోవు రామునికథతో నాటకము ప్రారంభమగును; అట్టి రాముని కథయే తాను రంగస్థలముపైఁ బ్రదర్శించపోవు చున్నాడు. విపత్కరమగు సందర్భములను సృష్టించి యందు రాముని నేవిధముగాపరీక్షకు నిలబెట్టి బోవుచున్నాఁడో ఈ ప్రస్తావనయే స్ఫురింపఁ జేయును.

రాముని ధర్మప్రియత్వమును ఒకవైపు నను, అతని సతీప్రణయ పరత్వమింకొకవైపు నను నుంచి మొదటి యంకమునే యొకగొప్ప విషాదాంత కావ్యమువలె చేసియున్నాడు. ఈ యంకమును పాశ్చాత్య విషాదాంత నాటకములు సాధించు హృదయక్షాళనమును అవలీలగా జేయుచున్నది. సహృదయుల

సహృదయులను సంపూర్ణముగా రాముని వైపు మరల్చు అంశమిది.

షేక్స్పియరు మహాకవి నాటకములలో నాయకుఁ డత్యున్నత స్థితిలో నున్నప్పు డాతని జీవితములో నొక దారుణమైన పరిణామ మొకటి యేర్పడి యతని నొక పతితునిఁజేసి వాని జీవితమునే విషాద గర్భములోనికి ద్రోసివేయును. అప్పుడాతని హృదయములోని భావసంఘర్షణపు ప్రాబల్యమున నాతఁడేవో మాటలనును; విలపించును. ఆ పలుకులు మనలో సానుభూతిని పెంపొందించి భావక్షాళనమునకు పాత్రులగునట్లుచేయును. ఉత్తర లో ప్రథమాంకమున సీతావియోగమును పొందబోవు రాముని చూచినపుడు మనకట్టి సానుభూతియేకల్గును. ఆతని మంచితనమే, ధర్మమందలి విశ్వాసమే, యాతనికి భార్యావియోగమును కల్పించి జీవితమును విషాదపూర్వకముగా చేసినవి. ఆసందర్భములో సీతాదేవిని త్యజింపబోవుటకు ముందుగా రామునిలోగల్గిన ఆవేదానుభూతి గుండెలను ద్రెంపగల్గునంత శోకపూరితమైనది. ఇట్టి విషాదమును బోషించుట మాటలా! గుండెలవియునట్లుగా నేడ్పించుటకుకూడ నొక మార్గముండవలె. ఒకసారిగా ఏడ్పించరాదు; క్రమముగా శోకముబికి పైకిపొంగిననేకాని ప్రేక్షకుని హృదయమార్ద్రమగుట జరుగదు. కనుక, అందులకు కావలసిన ప్రయత్నమంతయు నీ వాతావరణ కల్పనలో నున్నది. అందుకే యిట్టి ప్రస్తావనము గూర్చినాఁ డతఁడు.

ఇది యొక అపూర్వమగు కళాసృష్టి. (ఇట్టి కల్పనలో భవభూతికి భాసుని ప్రతిమా కల్పన మొజ్జబంతియైయుండునేమో!) భవభూతి గొప్పదనము నిది యధికముగా వెల్లడిచేయుచున్నది. నాటకకాలమునకు పూర్వమున నాయికానాయకులు గడిపినజీవితమును రమణీయముగారూపొందించినదది. అపరిచితులకు— రామాయణకాలపు సాధారణము ప్రజలకు —విషయ వివరణ ప్రాయమైనదిది. ఆనాటికి వారికి తెలిసినదొక్క విషయమే. శ్రీరాముఁడు సతీసమేతముగా, లక్ష్మణునితో వనవాసమునకు వెళ్లిన విషయము. కాని వనవాసమును వారెట్లు గడుపగల్గిరో ప్రజలకు తెలియదు. తెలిసినదని యనుకొన్ననూ, సాకల్యముగ మాత్రముకాదు. తమప్రభువు గతమునందెంతటి సుఖదుఃఖములకు లోనయ్యెనో వారు తెలిసికొనుట విషయ వివరణమేయయ్యు భవభూతికది చాల యవసరము. అంతర్నాటకమునందీ ప్రజలే సీతాదేవి యొక్క పవిత్రతను గుర్తించునట్లు చేయుటకది యుపకరణమగును.

చిత్రపట సందర్శనము ప్రేక్షకసమూహముపై నమిత ప్రభావముకలది. చిత్రములను చూచునపుడు సీతారాములు తమహృదయాంతరములలో గల్గు భావపరంపరలను వ్యక్తీకరింతురు. అమిత వైభవముతో చక్రవర్తియైన రాముడు నాతనిప్రియ సీతాదేవి రంగస్థలమునందు చిత్రములను గాంచుచున్నారు. వారి వర్తమాన జీవితమును

కనులారగాంచు ప్రేక్షకులకు వారి 'గత జీవితము'లోని ఖిన్నతను, శోకమును, ప్రేమను, వారి మాటలలోనే తెలియజేయుటలో చాల ప్రయోజనమున్నది. రంగస్థలముపై కొన్ని క్షణముల కాలములో సీతారాములు మనవము చేసిన కొన్ని గతించిన విషయములలోనే యంతటి శోకము నిండియుండగా నింక పధ్నాలుగు సంవత్సరములు వారు పడిన కష్టముల వలన కల్గిన శోకము ఎంత సహింపరానిదో అని అనిపించును. ఆనాటి యిడుములను గూర్చిన స్మృతియే యింత హృదయవిదారకమగుచో ప్రత్యక్షానుభవములో నా యిడుమ లెట్టి దుఃఖమును నిండించినవోయని యూహింపకపోము. అట్టి యూహాలతో నాదింధునము నెడ మనకొక సానుభూతికల్గును. "పోనిమ్ము; ఏదో కష్టపడినారు. ఇప్పటికవి గడచినవి. రాముఁ డయోధ్యాపాలకుఁడైనాడు. సీతాదేవి యాతని పట్టమహిషియైనది. సుఖడోలలలో మధుమయ జీవితమును గడుపుచున్నారు వీరు; వీరి ప్రణయమేకాకృతి నొందబోవు చున్నది. ఆపాటి చాలును" అని ప్రేక్షకుఁడు వారిని గూర్చి యూహించును. ఇట్లే వారింకా పదికాలములు పాటు వచ్చు వచ్చుగా నుండెదరు గాక యని యాకాంక్షించుచు సహృదయుఁడుండును. సామాజికుని మనోవృత్తి నిట్లు సీతా రాముల ఏకత్వమును వాంఛించునట్లు పెంపొందించి అదే సమయములో నాయికా నాయకుల ఎడబాటును కల్పింపజేసినాడు భవభూతి. దీనివలన సామాజికుఁడు చూపు 'జాలి'కి అంతముండదు.

సహృదయుని భావములను తన ఇతివృత్తమున కనువగు విధముగా తన ఇష్టము వచ్చిన తీరులో నడిపింపఁ జూచును భవభూతి.

ఈవిధముగా సహృదయుని మనస్సును బాగుగా కొల్లగొట్టి రాబోవు విషాదమునకు గాంభీర్యమును, తీవ్రతను చేకూర్చుటయే యాతని పరమావధి. తాను సృష్టించు పాత్రల మనోభావములను వెలికి తెప్పించుటయే కాక, దాని ద్వారా సహృదయ మనోవృత్తులను తన రూపక రసప్రవంతిలో లీనమగునట్లు చేయఁజూచును భవభూతి. ప్రేక్షకుల మనోభావములపై పనిచేసి కథామూలమున వారినేడ్పించి తమాషా చూడదలంచిన వానివలె యీతడీ సన్నివేశమును కూర్చెనా యని యనిపించును. ఎంత గొప్ప మానసిక శాస్త్రవేత్తయో !

తండ్రి యెడబాటునకు విచారించు జానకి కుత్సాహము కల్గించుటకే యీ చిత్రముల వ్రాయించినాఁడు రాముఁడు. ఇది సమయోచితమే. అయినను ఇందు సామాజికులకు ముందుగా నిసుమంతైన నూహింపనలవికానంత యుత్కంఠ పుట్టించు చిత్రవిచిత్రాంశము లెన్నియో కలవు. తరువాతి అంకములోను, అంతర్నాటకమునను వానికి ప్రయోజనము లున్నవి. "చిత్తరువు సమీపించినంతనే ముందు సీతకు కనవచ్చినవి జృంభక శాస్త్రములు. రాముఁడు వాటి యుదంతము తెల్పి "ఇవి నీ సంతానము నాశ్రయింపగల

వ"ని వరమిచ్చును. కొడుకో లేక కొడుకులో పుట్టి పెరిగిన తరువాత వారికుపదేశింపవచ్చును గదా! ముందుగా నీ యభ్యనుజ్ఞ యెందుకు? తన కొడుకులు జృంభకాస్త్ర సంపన్ను లగుదురని ముందే సీత యానందించుటకు. ఇందలి యాంతర కారణమేమెూ! "స్వయముగా నీ కొడుకులకీ యస్త్రములుపదేశించు భాగ్యము నీకు పట్టదు. ఇపుడే యిచ్చివేయు" మన్న దైవ ప్రేరణము. దీని కంతకు ఫలము, గంగా తీరమున జన్మించినంతనే కుశ లవులకీ యస్త్రము లధీనములగుట, తరువాత మున్యాశ్రమములో కుశ లవుల యస్త్రలాభము విని రాముడు తానిచ్చిన యభ్యనుజ్ఞను స్మరించి, వారు సీత కచ్చట పుట్టినవారేయని నిశ్చయించుకొనుట. ఇంత నిగూఢార్థమైనదీ యస్త్ర ప్రసంగము— తరువాతి మిథిలాయోధ్యా వృత్తాంత చిత్రముల ప్రయోజనము, ఆనాటి తమ యనురాగమును సౌఖ్యమును సీతారాములు స్మరించుకొని యానందించుటయు, అంతటి ప్రాణవల్లభుడు తన్ను విడుచుట దుర్దైవమూలకమే యని యుత్తరత్ర సీత యనుకొనుటయు—

— పిదప, భాగీరథీ చిత్రమునుచూచి సీత నమస్కరించుటయు, నీ కోడలగు సీతకు మేలు కోరుచుండుమని రాముఁ డర్థించుటయు దేవతా విగ్రహ సందర్శనమందలి చర్యలవంటివే. అయినా, యీ ప్రార్థనము, గంగాదేవి, సీతను ప్రసవ సమయమందు రక్షింప సాధనమైనది— అంకాంతమందలి వసుమతీ ప్రార్థనము నిట్టిదే— అనంతరము వైదేహీ చిత్రకూట మార్గమందలి వటవృక్షమును ప్రస్రవణాద్రిని సాకూతముగ చూచునపుడు రాముఁ డామెతో నన్నమాటలు ముద్దగట్టిన వారి యనురాగ రసమును ప్రేక్షకుల కంటఁ బెట్టునవిగా నున్నవి." (శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాసము 'భారతి' సం-27. సంచిక-9.)

ఈచిత్రపట సందర్శనమను భాగమున సీతా రాముల సంవాదములు అతి ముఖ్యమైనవి. ఎడబాటు కోర్వలేని సీతారాముల ప్రణయము నవి కనులకుఁ గట్టినట్లు చిత్రించుచున్నవి. రావణాసురుని చెఱనుండి విముక్తి పొందిన సీతాదేవి యిప్పటి కింకను నాటి వియోగపు బాధను మరచిపోలేదు. ఆ మృదు హృదయకు గడచిన రోజులు పీడకలల వంటివే. ఇటువంటి మనోస్థితిగల పాత్ర ప్రక్కనున్న రాముఁడో?. ఈతఁడా! అప్పుడే కష్టాలను దాటి, లోకకంటకుడగు రావణుని పరిమార్చి తన హృదయేశ్వరిని దక్కించుకొనినట్టివాడు. అనురాగముగల దంపతులకు రావణునివలన కల్గిన ఎడబాటు ఒక మేలునే చేసినది. వారి ప్రేమలను పరీక్షకు తెచ్చినది. ఒకరియెడ మరియొకరికిగల అనురాగము విప్రయోగము వలన బాగుగా పరిపుష్టమైనది. ఇట్టి నాయికా నాయకుల మనోభావములా సమయములో నూహించుకొన వలసినదే కాని ఉగ్గడించలేము. సేతువును నిర్మించి దశకంఠుని దునిమి తనను కాపాడిన భర్తనుచూచి లోలోన గర్వించుచున్న సీత; పడరాని పాట్లుపడి ఎవరి

నైతే తాను దక్కించుకొనినాడో ఆమె సామీప్యములోనున్న రాము డింకొకవైపు. "నీకై నేను—నాకై నీవు" అని పరస్పర మొకరి కొకరు సన్నిహితులగు నాయికా నాయకులు. ఇట్టి వీరి దాంపత్యమును చిత్రించుటలో నీ దృశ్య మతి ప్రముఖ పాత్ర వహించుచున్నది. వారి హృదయాంతరములలోని భావములను సామాజికుని సహృదయాంగణములోనికిఁ బరావర్తింపఁజేయు భాగమిది. వారి ఆత్మాను రక్తికి, పవిత్రమైన యనురాగమునకు, నెడ బాటు కోర్వలేని వారి ప్రణయమునకు నిది ప్రతిబింబము. కనుల పండువుగానున్న యీ ప్రణయమూర్తులను ప్రవేశపెట్టి వారి యేక త్వమునే, వారి యద్వైతానురాగమునే మనము వాంఛించునట్లు చేయుచున్నాఁడు భవభూతి. సీతారాము లిద్దరిపై నొక విధ మగు గౌరవమును, అభిమానమును సహృద యుల దగ్గరనుండి సంపాదించుకొనినాడు భవ భూతి. కాననే "జనాపవాదము రామునకు తెలియకుండినచో బాగుండును" అను, భావము సామాజికుని హృదయములో వానికి తెలియకయే యుద్భవించును. నాయికా నాయకులకు రాబోవు ఎడబాటు నివారింపఁ బడిన బాగుండునను భావము కుతూకబంటియై రాముఁడీ జనవాదమును త్రోసిపుచ్చినచో బాగుండునని యూహించునట్లు చేయును. లోక మే విధముగా పోయిననేమి! అరమర లేని చిరతరస్నేహ రుచులు నిండిన వీరి దాంప త్యము నిలిచిన బాగుండునని యనిపించును.

తన కరుణరస గాథకు కవి తన ప్రేక్షకవర్గము నెంత సునిశితముగా తయారుచేయుచున్నాడో యని యాశ్చర్యపడునట్లు చేయునదీ భాగము.

ఈ ఘట్టములోని కొన్ని సంవాదము లను— 'లోనారయుటకు' వీలయినవన వలయును—

చిత్రము లెంతవఱకు రచింపబడినవను రాముని ప్రశ్నకు లక్ష్మణుఁడిచ్చిన సమాధా నము గమనింపఁదగినది. "వదినెగారి వహ్ని శుద్ధివఱకు;" అని, లక్ష్మణుఁ డనుటతోనే రామునకది బాధ కల్గించినది. దరిలేని కష్టా లనుదాటి సుఖాల పొలిమేరలలోపడిన రాము నకు "వహ్నిశుద్ధి" అను నొక్కమాటలో పునరావృత్తమగు కథ చాల గలదు. సీతా దేవి యరణ్యములలో నుండుట, శూర్పణఖా వమానము, కనకమృగ వృత్తాంతము, సీతా దేవి లేడిని తెమ్మని పట్టుదల చూపుట, విశుద్ధ చరిత్ర యగు నామె రావణునింట బంధింప బడుట, యుద్ధానంతరము భార్య శీలమునకు పరీక్షగా తానామెకు అగ్నిపరీక్ష కల్గించుట— మొదలగు విషయములన్నియు రాముని స్మృతిపథములలో సుడులు తిరిగి సాక్షాత్క రించి యుండును. ఇదివరకే ఆమె కది న్యూనత నాపాదించినది. ఇప్పుడది గుర్తు చేయబడుట రామున కిష్టము లేదు. ఆమాట ఎంత గుర్తుకు రాకుండినచో అంత మంచిది. కనుకనే ఆతఁడా విషయప్రసక్తివచ్చుటతోనే సీతాదేవి యనుగ్రహమునకై ప్రార్థించుట జరుగును. చక్రవర్తిగా తన ధర్మములను

నిర్వర్తించుకొనుటకాని తరువాత ఆ విషయాలను స్మరింప కూడదను వజ్రకఠిన హృదయుడు కాలేదింకా రాముడు. ఇప్పుడాతడు పరిపూర్ణముగా మానవుడు; కేవలము మానవుడే. నిండు చూలాలగు మైథిలి భవిష్యత్ రఘువంశతిలకులను వహించియున్నట్టి సమయమది. కులదీపకులగు కుమారులు తన ప్రియ సతికి కలుగవలయునని రాముని యతి గాఢమగు వాంఛ, సహజమే యది. ఆ సమయములో నామెను చూచినపుడెల్లను, ఆమెను స్పృశించినపుడును, అతనిలో ఉత్సాహముబుకుచుండుట సహజము. కాబట్టి తన ప్రియకు మనసు ప్రశాంతముగా నుండవలెననియు, నావంత చింతకాని, నిరాశకాని ఆమెకు కలుగకుండునట్లు సదా ఆమెను అనునయించుచు, ఓదార్చుచు, ఉత్సాహము కల్గించు మాటనే చెప్పుచు, అలరించుచు, తన సామీప్యములో నామెకు ప్రమోదము నిండునట్లు చేయుటయే యిచట రాముని పరమావధి. ఇచ్చోట జగదేక వీరుడగు రాముని హృదయమం దింత కోమలత్వ మెట నుండి వచ్చినదని యబ్బురపడక మానము. శ్రీరాముడే యిట్టివాడైనచో నిక సీత? ఈ దంపతుల మృదులస్వభావము అట్టిది. దానిని తేటపరచుటకు వాల్మీకియో, భవభూతియో కావలెను. అంతే.

(సశేషము)

# అద్య

కె. ఇందిరాదేవి.

వినబడీ వినబడని నీదు వేశ్మ ఘంట
లీ యుషస్సున విడువక మ్రోయదొడగ
ఇన్ని యేండ్ల నా బ్రతుకున నింత మధుర
మైన ఘంటలు వినబడినట్లు లేదు.

అద్యఘంటికానాద నిర్యాతమైన
గాథ సుప్తను, తత్స్వనా కర్షిత ప్ర
భాత భవదాల యాధ్వ ప్రయాతనయి ఒ
కర్తె చనుదెంచినాను నీకడకు స్వామి!

రిక్తహస్తాలతో, అశ్రుసిక్త నేత్ర
యుగముతో వచ్చినాను నీవున్న యాల
యాంగణమునకు నాదైన యంతరువును
నీదు నంతరువు తెలియనేరకుండ.

ఆలయాజిరరంగవల్లీ లతాళి
పూయదేవ్రాలు, నా నేత్రములను పెరికి
అచటనే యుంచినాను, నిన్నార్తనగుచు
కనుగొనగ, ప్రభువ! నాకు కన్ను లేవి?

అట్టులే తిరిగి, విభు! నే నరుగునపుడు
నా పదమ్ములు వాసిని నలుపు నేమొ?
ఒక్కసారి నీ బాటవ్రేళ్ల నొక్కిపొమ్ము,
ఓ దయాజలపాతమా!

# శాపము - వరము

సేఠ్ గోవిందదాస్.

## పూర్వార్థం.

— అందమైనగది. ప్రక్కగోడకు మూడు కిటికీలు, కిటికీలకు సగందాకా అందమైన తెరలు. గదిమధ్య గుండ్రని బల్ల, బల్లప్రక్క చిన్న సోఫా. వెనుక గోడదగ్గర అందమైన మంచం, మంచం ప్రక్కన ఉయ్యాల, దానికి దోమతెర. గదిలోని ప్రత్యణువూ ధనికత్వాన్ని సూచిస్తూ ఉంటుంది. మంచంమీద పాలిపోయిన మొగంగల స్త్రీ. అందమైందే. సోఫాలో ఒక పురుషుడు. దోమతెర ఉండడంవల్ల తొట్లెలోంచి అస్పష్టంగా కనిపించే శిశువు. స్త్రీ ముఖంలో ఉద్వేగం. పురుషుడి చూపులో శూన్యత్వం—

**స్త్రీ :—** అవును. ఇవ్వాళ్ల తప్పకుండా వినాలి. పోయేముందైనా మనస్ఫూర్తిగా నన్ను చెప్పనీయి. (కొంచెం ఆగి) ఈ పన్నెండేళ్లు ఒక యుగంగా గడిచాయి. ఈ యుగంలో ఒక్కసారైనా నా మాట వినలేదు. ఈ రోజు తప్పక వినాలి. ఇన్నేండ్ల ఈ ఘోరమైన తపస్సు.... దాని కీమాత్రం ఫలంకూడా లేదా?.... (గోడవైపు చూస్తూన్న అతను ఆమెవైపుచూచి దీర్ఘశ్వాస వదుల్తాడు.) వినటానిక్కూడా కష్టమేనా?.... కష్టమైనాసరే. నువ్వెన్ని నిట్టూర్పులు వదిలినాసరే. ఎంత బాధ కలిగినాసరే. తప్పకుండా వినితీరాలి. (పురుషుడి పెదవులపై శుష్కహాసరేఖ మెరిసి మాయమవుతుంది) ఇంత శుష్కమైన హాసం! ఇంత క్షణభంగురం!.... మనస్ఫూర్తిగా అందంగా ఉండే నీ హాసం కాంక్షించి, దానికోసం నా సర్వస్వాన్ని అర్పించాలని ఈ ఇంట్లో అడుగు బెట్టాను. కాని....కాని.... అదంతా ఎక్కడ పోయింది?.... శుష్కమైంది. (కొంచెం ఆగి) ఈ సంబంధం కుదిరిందని నాన్న ఎంత సంతోషించాడు! అమ్మకు పట్టరానంత ఆనందం కలిగింది. అసూయ పడ్డ స్నేహితురాళ్లూ లేకపోలేదు. సర్వ సుఖాలూ నా ముందు వచ్చిపడ్డాయన్నారు ఇరుగూ పొరుగు.... నేనుకూడా ఎంతో ఆనందించాను. కోటీశ్వరుని ఇంటి కోడలిని. నీవూ అందగాడవు, సంస్కారంగల వాడవు అని విన్నాను. నాకింకేం తక్కువ? అనుకున్నాను.... మా నాన్న మీఅంత ఆస్తిపరుడు కాకపోవచ్చు. అయినా అడుక్కుతినేవాడూకాదు. అన్నవస్త్రాలకు లోపం లేదు. చక్కగా నన్ను చదివించాడు. లోక జ్ఞానం కలిగించాడు.... ఉత్తమ సాహిత్యం పఠించాను. కాళిదాసాదులను చదివి ఆనందించాను.... భవిష్యజ్జీవితాన్ని గూర్చి ఎన్నో కలలు కన్నాను— మనం ఎల్లాఉండాలి, ఏఏ ఋతువుల్లో ఏఏ ప్రదేశాల్లో తిరగాలి. మన ఆహార విహారాలు ఎల్లాఉండాలి, ఉషస్సులో, సంధ్యలో, చీకట్లో, వెన్నెల్లో ఎక్కడెక్కడ ఎల్లా సుఖం పొందుతాము— ఇవన్నీ నామనఃఫలకంపై రేఖాచిత్రాలుగా చిత్రించుకున్నాను. సమస్త సౌఖ్యం మన పాదాలముందు

---

సేఠ్ గోవిందదాస్ హిందీలో ప్రఖ్యాత నాటకకర్త. ఇంత వైవిధ్యం నాటిక రచనలో చూపిన మరొకరు హిందీ సాహిత్యరంగంలో లేరనవచ్చు. కులీనతా, శశిగుప్త, ప్రకాశ్, సిద్ధాంత స్వాతంత్ర్య, దుఃఖ్ కిస్‌మే వంటి నాటకాలూ, శాప్ ఔర్ వర్, సృష్టి ఔర్ ప్రలయ్ వంటి నాటికలు ప్రసిద్ధాలు.

పదిగాపులు కాస్తుందనుకున్నాను. ఎన్నో అనుకున్నాను. ఏమో అనుకున్నాను. అవే నా జీవిత సౌధానికి పునాదిరాళ్ళు అయినవి.... (కొంచెం ఆగి నిట్టూర్పు విడిచి) అన్నీపోయినవి. అన్నీ కుంగినవి. జీవితాన్నంతా శిశిరం ఆవరించింది. ఇక వసంత దర్శనం కావడానికి ఏమాత్రమూ వీల్లేని విధంగా ఆవరించింది. (ఆమెవైపు చూడటానికి జంకి, అతడు గోడమీది చిత్రాన్ని చూస్తుంటాడు.)

ఇటుచూడు. ఇప్పుడే నా కథ మొదలెట్టాను. అప్పుడే మొహం తిప్పావు. ఇంకెంతో ఉంది చెప్పాలిసింది. పన్నెండేళ్ల చరిత్ర. పెద్ద పురాణం. (అత డామెవైపు తిరుగుతాడు.) అయితే ఆ శిశిరం ఎందు కావరించిందంటావు? కారణం ఎవరు?.... నువ్వు. నీ ప్రేమ నాకు లభించలేదు. ఆ ప్రేమ తేంది ఏదీలేదు. ఒక్క శిశిరం తప్ప. ప్రేమకు బదులు ఉపేక్ష, ఔదాసీన్యం. విరాగం నా పాల పడ్డాయి. నువ్వు నా విషయంలో వట్టి శిలామూర్తి అయిపోయావు. (అతడు లేవబోతాడు)

లేవకు. కూర్చో. నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. (గట్టిగా) నా మాటలు వినకుండా పోవడానికి వీల్లేదు. కూర్చో. (చిరాగ్గా అతడు కూర్చుంటాడు.)

చిరాకెందుకు? నెమ్మదిగా విను.... నీ ప్రేమ లభించని నాకు ఈ ఐశ్వర్యం అంతా స్మశానంగా తయారయింది. వెండి, బంగారం మణులూ, రత్నాలూ కాళ్లకు గుచ్చుకునే కంకరాళ్లుగా మారినయి. సమస్త వైభవం చితాభస్మమనిపించింది. (అతడు నిట్టూర్చుతాడు.)

క్షణ క్షణం నిట్టూర్పు, ఫరవాలేదు. విను.... నాకిల్లా ఉన్నా నీలో ఏం మార్పులేదు. నాకు ఈ శూన్య ప్రపంచంలోకూడా నువ్వే. కాని నీ ప్రపంచంలో?.... నీ ప్రపంచంలో లక్షలు. ఏది కావలిస్తే అది. డబ్బుకు రానిదేమిటి? నావంటి ప్రేమస్వరూపిణి దొరక్కపోవచ్చు. అయినా నీకు ప్రేమ ఎందుకు. వట్టి వాంఛ, కామం. అవి డబ్బుతో నీకు పూర్తవుతాయి.... నీ విషయం తెలిసి ఎన్ని నిట్టూర్పులు! నీ ఈ నిట్టూర్పులకన్న భయంకరమైనవి. ఎంత కన్నీరు! నీకు దాన్ని గూర్చిన ఊహకూడా అందదు.

అత్త మామలు అప్పుడప్పుడు నన్ను అందమైన విహార ప్రదేశాలకు తీసుకెళ్లేవారు. అనేక సుందర దృశ్యాలు చూపించేవారు. నేను సంతోషంగా ఉంటానికి ఎంతో ప్రయత్నించేవారు.... కాని.... నాకు సంతోషం ఎక్కడ. నీవు లేకుండా ఒంటరిగా ఉన్న నాకు అవన్నీ నిర్జీవాలు. నీ ప్రేమ నాకు లేనప్పుడు సర్వమూ అంతే. (కొంచెం ఆగి) ఈ స్థితిలో— నువ్వు నాకు దూరమవుతున్నకొద్దీ— నన్నూ, నా అదృష్టాన్నీ నిందించుకునేదాన్ని. ఈ జన్మలో ఏమీ పాపం చేసినట్లు నాకు గుర్తులేదు. ఇది గతజన్మ పాపఫలం అయి ఉంటుంది. అయితే ఈ ఐశ్వర్యం, ఈ బాధ. ఈ రెంటికీ పొత్తేమిటి?— ఈ సందేహం కలిగేది. మాటి మాటికీ కలిగేది.... నెమ్మది నెమ్మదిగా నీ మీద కోపం కలుగ సాగింది. ప్రతీకారం చేయాలనిపించేది. ఎల్లా?.... నీ మల్లే నేనూ ఎందుకు స్వచ్ఛందంగా తిరగ్గూడదు? (అతని ముఖంలో కోప రేఖలు. క్రిపెదవిని మునిపళ్లతో నొక్కుతుంటాడు.) కోపం వస్తోందా? (ఏహ్యాన్ని సూచించే నవ్వు) వట్టి భావనకే ఇంత కోపమా? అవును. ఎందుకురాదు. స్త్రీ కూడా డబ్బుతో కొనే ఇతర వస్తువులాంటిదే గదా మీకు! జీవద్వస్తువును కూడా మీరు నిర్జీవంగానే చూస్తారు కదా! ఆమె హృదయంలో కామం కల్గడం పాపం, క్రోధం కల్గడం క్షమించరాని విషయం. ఇవన్నీ మీ ఊహలు. ఎందుకని కల్గుతున్నాయో ఆలోచించారా? నీవల్ల నిరాశపొంది, నీలా గడపాలనుకున్నాను. అదికాక నిన్ను చూచి ఇంకేమనుకోగలను? నా భావ

నకే నీకింత కోపం వస్తే, నీ పనులకు నాకెంత కోపం రావాలో ఎప్పుడైనా ఆలోచించావా? (అతడు గబాల్న లేస్తాడు.) కూచో. (చేతితో కుర్చీ చూపు తుంది.) భయపడకు. నా భావన భావనగానే ఉండి పోయింది (అతను కూర్చుంటాడు.) న్యాయాధి కారిలాగా మొహం పెట్టకు. నా భావనను నీ ఇచ్చాను సారంగానే పరిష్కరించుకున్నాను. నాలో సంస్కారం, సంస్కృతీ నీలోలా నశించలేదు. చదివిన చదువు వ్యర్థం కాలేదు. చిన్నప్పుడు విన్న విషయాలపై శ్రద్ధ పోలేదు. అదే నన్ను,' నా మనస్సును బంధించింది. ముందుకు పోనీలేదు. కాలు జార నీయలేదు— ఈ సమాజాన్ని నేను గర్హిస్తున్నాను. ఈ కుటుంబాన్ని నేను అసహ్యిస్తున్నాను— అయినా వీటికి చెడ్డపేరు తేవడానికి, కళంకితం చేయడానికి నా సంస్కారం ఒప్పుకోలేదు.

(కొంచెం ఆగి) ఇంతటితో నా బాధ ఆగలేదు. కాలం గడుస్తున్నకొద్దీ, సంతానం కలక్కపోవడంవల్ల ఇంకా పెరిగింది. సంతానం కోసం చేసిన పూజా పునస్కారాలూ విఫలం కావడంతో అత్తగారి దృష్టి నా విషయంలో మారింది. దాంతో ఈ జీవితమంతా వట్టి నటనగా నాకు భాసించింది. సంతానం కలక్కపోవడంవల్ల నేను దోషిగా కనిపించ సాగాను. అత్తగారు నన్ను గొడ్రాలు అంది. దరిద్రురాలు అంది. రాతి బొమ్మ అంది— మా అమ్మకి నే నొక్కతెనే సంతానం. మళ్లీలేదు— నేను మా అమ్మనూ మించాను అంది. నాపిదనుంచి దూషణ నా తల్లిదండ్రుల మీదికి సాగింది. నాకెంత బాధ కలుగుతుందో ఆలోచించు. (అతడేదో అనబోతాడు. మాట పెకలదు.) మాట పెకలదేం? ఎల్లా పెకలుతుంది?.... సంతానం కలక్కపోవడంలో నాదేనా దోషం? నీది లేదా? భారతంలోని విచిత్రవీర్యుడు గుర్తొచ్చాడు. వేదవ్యాసుడు గుర్తు వచ్చాడు. మీకు కావలసిందేమిటి? మీ కులాన్నుద్ధరించడానికి, మీ సంపత్తికి వారసత్వం పొందడానికి సంతానమే కదా. అందుకు సాధనం నేను. నేనుకూడా భారత కథలోలా మీ కులాన్నుద్ధరిద్దామా అనుకున్నాను. (అతడు గబాల్న లేచి పచార్లు చేస్తుంటాడు.)

కూచో. కూచో. నువ్వంత గాభరాపడనక్కర్లేదు. నా ఊహ కార్యరూపం ధరించలేదు.... మీ నాన్న అమ్మల బలవంతంవల్ల, వంశాంకురం కోసం నాతో సరిగా వ్యవహరించడం ప్రారంభించావు.... కూచో. (అతడు కూర్చుంటాడు.)

ఏది లేకపోవడంవల్ల ఇన్నాళ్లూ ప్రపంచం నాకు శూన్యమైందో, అది లభించినా నాకు ఆనందం కలుగలేదు. నీ రాక ఎందుకో నాకు తెలుసు. ప్రేమ లేదు, పాడులేదు. కేవలం చర్మాస్థిగతమయిన నా శరీరం నుండి, నీ భవిష్యత్తుకోసం, నీ కుటుంబం కోసం, నీ వంశంకోసం ఒక జీవిని సృష్టించడం కోసం. కేవలం స్వార్థం కోసం. నీ ఊహ, నీ ప్రవృత్తి నాకు పరమాసహ్యం కల్గించినవి. నీరాక నాలో నిర్లిప్తత, విరక్తి రోజురోజుకూ పెంచసాగింది. (అతడు ఆశ్చర్యంగా నోరు తెరచి చూస్తుం టాడు.)

ఎందు కాశ్చర్యం? నన్ను మరుభూమిని చేసి నానుంచి ఫలితం ఆశిస్తే ఏమవుతుంది? నా యీ శరీర యంత్రం శిశువుని తయారుచేయకపోయేప్పటికి మరో యంత్రాన్నిగూర్చి ఆలోచనలు సాగాయి. నీకు నేనుండగా మరో పెళ్లి. పతితులు, అధములు, రాక్షసుల చేతులో మరొక ఆత్మ, మరో సుకుమార ప్రాణం నలిగిపోతుందన్నమాట. బలి అవుతుందన్నమాట. ధనవంతుల సంతాన వాంఛకు, హృదయాన్ని వణికించే ఈ బలిదానం! సమాజంలో ఎందరో పెళ్లికాని యువకులున్నారు. కాని ధనికులకు, సంతానం కోసం, పెళ్లిమీద పెళ్లి. పెళ్లాం ఉండగా మరో పెళ్లాం. ఎందుకు కాదు? డబ్బుతో

ఏం కొనలేదు? దానికి లొంగేవాళ్లు ఎప్పుడూ ఎవరో ఉండనే ఉంటారు. ఆత్మను చంపుకున్నవాళ్లు ఎప్పుడూ ఉండనే ఉంటారు.... ఈ రాక్షస యజ్ఞంలో మరో సుకుమారి ఆహుతి అవుతుందనేప్పటికి వణికి పోయాను.... నాకు గర్భం నిలిచింది. (అతను శాంతంగా శ్వాస తీసుకొంటాడు.) ఇప్పటికి శాంతం కలిగిందన్నమాట. సరె.... ఉపష్టమైన ఆదరం మళ్లీ నాకు లభించింది. పట్టరానంత లభించింది. ఓర్వరానంత లభించింది. గొడ్రాలు దేవత అయింది. దరిద్రురాలు లక్ష్మి అయింది రాతిబొమ్మ సుమ సుకుమారి అయింది. ఎన్నెన్ని మందులు! ఎన్నెన్ని పళ్లు? ఎల్లాంటి ఎల్లాంటి ఆహారం! ఓహ్! చెప్పడానికి వీల్లేదు. కొండమీది కోతిని తెమ్మంటే తెచ్చేంత చేసారు. నావంటి 'రాతిబొమ్మ' నీ హృదయంలో కూడా కొంచెం అనురాగం కలిగించింది. (అతని ముఖంలో ప్రసన్నభావం) అబ్బ! ఎంత ప్రసన్నత్వం!.... స్త్రీకి సంతానమంటే ఎంత ఆనందం. తల్లికావడంలో ఎంత తృప్తి ఉంటాయో నాకు తెలుసు. కాని లేశమాత్రంకూడా అవి నాలో కలుగలేదు. మీ అందరి ఆనందం చూస్తుంటే నాకు మండిపోయేది. మీ అందరి ప్రవృత్తి నాలోని సద్భావనల్ని నాశనం చేసింది. ఉత్తరాధికారి కోసం చేసిన మీ ప్రయత్నాలు నన్ను ఉన్మత్తురాల్ని చేసినవి. నేను సర్వనాశనం కాంక్షించాను. శుభం ఏమాత్రమూ కోరలేదు. (అతడు మళ్లీ లేస్తాడు.)

(తీక్ష్ణంగా) కూర్చో. (అతడా తీక్ష్ణతకు అదిరిపడి కూర్చుంటాడు.) ప్రసవ సమయం వచ్చింది. ఎంత భయంకరం! ప్రసవం కష్టతరమయింది. నేను బ్రతికితే శిశువు చనిపోతుంది. శిశువు బ్రతకాలంటే నా కడుపు చీరాలి. నే చనిపోతాను. మీరంతా సందిగ్ధంలో పడ్డారు. ఇద్దరూ బ్రతుకాలనే మొదలనుకున్నారు. కుదరనప్పుడు శిశువు వైపే మొగ్గారు. అనుకున్న వస్తువు పొందడానికి ధనికులు యెవరు ఏమైనా లెక్కచెట్టరు. శిశువు అంటే ఇంత వాంఛా? దాని విషయం ఏమాత్రమూ తెలియదు. దానికోసం ఇన్నేళ్లు కలిసి ఉన్న, తెలిసిఉన్న పెద్ద ప్రాణిని హతం చేయడానికూడా మీరు వెనుకాడలేదు. ఎంత పతనం! ఎంత రాక్షసత్వం! నేను నిరాకరించాను. అయినా నన్ను మాయచేసి స్పృహ తప్పించి మీ పని నెరవేర్చుకున్నారు. తిరిగి స్పృహవచ్చాక కాని నా కడుపు చీరారని తెలియదు.... ఒక స్త్రీ జీవితంతో ఇల్లా ఆటాడారు గదా ఒక పురుషుడి విషయంలో ఇలా చేయగలరా?.... స్పృహ రాగానే మొదట విన్న మాట, "ఆడపిల్ల" అని. అత్తగారిమాట. ఆ మాటలో ఎంత వేదన! — భూకంపం వచ్చింది. తుఫాను రేగింది. అగ్ని వర్షించింది— అంత వేదన. పురుష సంతానం కాదు. ఉత్తరాధికారి కల్గలేదు. ప్రయత్నమంతా విఫలం— కలిగింది శిశువేకాని ఏ రాయో, రప్పోకాదు.... ఎందుకింత? ఆడపిల్ల అంటే ఎందు కింత తిరస్కారం? అంత చెడ్డ వస్తువు ప్రపంచంలో లేదన్నట్టు.... సరె. అయిందేదో అయింది. ఈ సారి మగపిల్లవాడు కల్గవచ్చు. ఇదొక దిలాసా. నా ప్రమేయం ఏమీలేదు. విలువలేదు. అందుకే నావిషయంలో నిర్లిప్తత.

సరె కాని, నాకిప్పుడు అత్యంత ప్రియమైన వస్తువేదో తెలుసా? తెలియదు. విను. (తొట్లెవైపు చూపుతూ) ఈ పాప. ఎందుకో తెలుసా? దీనిపై మీ కెవ్వరికీ ప్రేమలేదు. ఆదరం లేదు. అందుకని. నాలో మాతృభావనలు రేకెత్తినవి. దీన్ని నా పాలతో పెంచాలి. పెద్ద చేయాలి.... కాని.... దీనికోసం నే నాగలేను. నే బ్రతుకను. నిన్నూ, మీవాళ్లనూ, మీ సంపదనూ, మిథ్యాకీర్తినీ వదులుతున్నందుకు నాకు విచారం లేదు. మీరంతా నా ఆత్మను ఎప్పుడో హత్యచేసారు. సంతానం కోసం నా కడుపు చీరి దేహాన్ని హత్యచేసారు. అందువల్ల. కాని ఈ పాపను గూర్చి దుఃఖం ఉంది. అయినా నే నాగను. పోతాను. మరు జన్మలో సంపన్న గృహంలోకి

నంపవద్దనీ. నంపినా విద్యావంతురాల్ని చేయవద్దనీ. నన్ను యంత్రివత్తుగా సృష్టించమనీ. దయఉంటే మరీ పేదకుటుంబంలో పుట్టించమనీ భగవంతుని ప్రార్థిస్తాను. పేద కుటుంబాల్లో చిన్న ప్రాణంకొరకు పెద్ద ప్రాణి కడుపు చీరరు. చంపరు. వాళ్లకు హృదయం ఉంది. ఆత్మఉంది. ప్రేమానురాగాలున్నాయి. ఎందుకు? వాళ్లు ధనంతో మత్తెక్కిన వారు కారుకాబట్టి, శుభకామన కలవారు కాబట్టి.... నేను పోతూ పోతూ ఈ ఇంటికి మరో ఆత్మవంతురాలిని బలిచేయవద్దనీ, తప్పదంటే చదువూ సంస్కారంలేని యంత్రంలాంటిదాన్ని బలిచేయమనీ భగవంతుణ్ణి కోరుతున్నాను. (స్వరం క్షీణిస్తుంటుంది.) జీవితంలో సామాన్యంగా వెలుగూ నీడా ఉంటాయి. కాని, నాకు ఒక్క నీడే. సర్వేంద్రియాలూ, సర్వ సదుపాయాలూ ఉండి ఏ సుఖమూ అనుభవించలేక పోయాను. జీవితం మీ చేతిలో కీలుబొమ్మ అయింది. వ్యర్థమయిపోయింది. (అత దెగాదిగా చూస్తుంటాడు. కొన్ని క్షణాలు స్తబ్ధత.)

(ఒకేసారి తీవ్ర స్వరంతో) చూడు. నాకు సమయం దగ్గరికొచ్చింది. పోతున్నా. నిన్ను శపించి పోతున్నా. నన్ను బాధించిన మీకు సుఖం ఉండదు.. ఉండదు.... ఇన్ని సదుపాయాలూ, ఐశ్వర్యమూ, ఏలూ ఉండికూడా కాలుజారని నేను, నిజంగా మహా పతినే అయితే, నా ఉసురు.... ఉసురు.... తగిలి తీ—రు....తుం....ది. (రొప్పుతూ మంచం మీద గభాల్న పడిపోతుంది. అతడు ఆమె దగ్గరికి పరుగెడుతాడు.)

తెర.

ఉత్తరార్థం.

— పల్లెటూరిలోని గడ్డికప్పుగల ఇంటిలో ఒక గది— పూరిటిగది, గదిగోడలూ, అక్కడి వస్తువులూ, మంచమూ అన్నీ పేదరికాన్నే ధ్వనిస్తుంటాయి. మంచం దగ్గిర ఒక చాప పరిచిఉంది. ఒక ముప్పదైదేండ్ల పురుషుడు కూర్చొని ఉన్నాడు. మంచంమీద నవప్రసవిత అయిన స్త్రీ. ఇరవై ఎనిమిదేండ్లుండవచ్చు. కృశించి ఉంది. నత్తిగిలి అతని వైపు చూస్తోంది. ఆమె వీపువైపు పసిపాప. గది అంతా, పేదదే అయినా, పరిశుభ్రంగా ఉంది—

స్త్రీ :— చివరికి.... చివరికి నా మాటలు వినండి, సామాన్యమైన నా అందాన్నే గొప్ప అందంగా, సామాన్య కంఠస్వరాన్ని మధురస్వరంగా భావించేవారు. అల్లాంటి నా మాటలు వినండి. (అతడు కన్నీరు కారుస్తాడు.) కన్నీరు కార్చుతున్నారా! వద్దు. వద్దు. ఇంకొంత సేపటికి ఆగే నా మాట ఇప్పుడే ఆగిపోతుంది. మీతో మాట్లాడగలిగిన ఈ అవకాశాన్ని నన్ననుభవించనీయండి. లేకపోతే నా మాటలు నాలోపలే ఇమిడి పోతాయి. లోనను కొన్న మాటలు పైకి చెప్పితే ఆనందం కలుగుతుంది. ఈ అవకాశం పోనీకండి. (దీనంగా) నా చివరి కోర్కె పూర్తి కానీయరూ! (అతడు కన్నీరుతుడుచుకొంటాడు.) అల్లా. అల్లాగుండాలి. నా మాటలన్నీ వినాలి మీరు. గడచిన పన్నెండేండ్లు— ఎంత హాయిగా గడిచాయి— స్మృతికి తెచ్చుకొని మీకు చెప్పి, ఈ చివరి ఆనందం పొందుతాను.... వింటారు గదూ! నా కళ్లల్లో తిరిగే గత జీవిత దృశ్యాలను చెప్తే వింటారుగదూ!.... నా మాట కాదనలేరు. వింటారు. మంచి రైతు కుటుంబంలోవారు. మంచి హృదయం గలవారు. వింటారు. మీ కుటుంబం, మీరూ ఇల్లాంటివారనే మా నాన్న మీ సంబంధం కుదిర్చాడు. చిన్నప్పటినుండీ గారాబంగా పెంచాడు. ఏదో కొంచెం చదివించాడు.... నా కంఠస్వరం బాగుందంటారులు మీరు. చిన్నప్పుడు ఏదో కొంచెం నేర్చుకొన్న సంగీతం ప్రభావం అది.

ఎంత ఆనందంగా మన వివాహం జరిగింది! వివాహ కాలంలో పురోహితుడు పలికించిన ప్రతిజ్ఞలు కర్తవ్యాన్ని ఎంత దృఢతరం చేసాయి! (కొంచెం ఆగి) ఆ ప్రతిజ్ఞలు పాటించడంలో నావల్ల ఏమైనా

లోపం కలుగవచ్చు. మీరు మాత్రం సక్రమంగా పాటించారు. నన్ను క్షమించరూ! (అతడామె చేతిపై చేయివేస్తాడు) నా వల్ల తప్పు జరిగిందని మీ రెప్పుడన్నారు? 'తప్పుచేయనివా రొకరున్నారు' అని మీరంటే 'ఎవరు?' అనేదాన్ని. నన్ను చూపేవారు. తరువాత అడగడం మానేసాను.... ఆ పెళ్లినాడు.... మిమ్మల్ని ప్రక్కచూపుల్తో చూస్తున్నప్పుడు నేనెంత పొంగిపోయాను! ఒక నిధి దొరికినట్టుగా— అది క్షీణించని నిధి. (మళ్లీ కొంచెం ఆగి) పరిచితమైన ఊరునీ, అమ్మనీ నాన్ననీ వదలడం చాలా బాధ అనిపించింది. దుఃఖం కలిగింది. కాని.... పల్లకీలో నా ప్రక్కవచ్చి మీరు కూచోనేప్పటికి శిథిలమైన హృదయానికి గట్టి ఆలంబనం దొరికినట్టనిపించింది.... మన ఊరికి దగ్గరగా వస్తున్నాకొద్దీ క్రొత్త ఉత్సాహం, స్ఫూర్తి కలుగసాగింది. 'ఇంకెంత దూరం?' అని అడుగుదామనుకునేదాన్ని. కాని అంతకుముందు మీతో మాట్లాడనేలేదుగా. సిగ్గు ముంచేసింది.... మన ఊరు చేరేప్పటికి మనస్సెందుకో విస్తృతమైనట్లనిపించింది. ఎక్కడలేని ఉల్లాసం కలిగింది. నన్నాహ్వానిస్తూ అప్పుడు మన ఇంటిముందు ముత్తైదువులు పాడిన పాటలు ఇంకా నా చెవుల్లో గింగురుమంటూనే ఉన్నాయి. అత్తగారు వచ్చి హారతి ఇవ్వడం, దిష్టి తీయడం ఇప్పటికీ కళ్లల్లో కదులుతూనే ఉన్నాయి. అత్తగారు నన్ను అతి ప్రేమగా కౌగిలించుకున్నారు. అప్పుడామె ఒక సంద్రంలా, మింటిలా. హద్దులేని ప్రేమ స్వరూపంగా కనిపించింది. ఆ కౌగిలిలో కేవల మర్యాద, ఆచారం, నటన ఏమీ లేవు. సంపూర్ణంగా ఆత్మీయత. కేవలానురాగం. అంతే....

(అతని కంళ్లలో నీరు నిండుతుంది.) వద్దు. వద్దు. (నెమ్మదిగా తుడుస్తుంది.) నేను చూడలేను.... తరువాత ఎంత హాయిగా రోజులు గడిచాయి! ఊహించనంత సుఖం లభించింది. మీ ప్రేమ, అత్తగారి అనురాగం, మామగారి ఆదరం నన్ను ఉక్కిరి బిక్కిరి చేసివేసినయ్. అత్తమామలకు నేనే సర్వస్వమూ అయినాను. మరి మీకు.... (బలహీనంగా చిరునవ్వు. అతడు కళ్లు నెమ్మదిగా మూసి తెరుస్తాడు.) అత్తగారు నన్నొక్కపనీ చేయనిచ్చేది కాదు. రోజులు గడచినా నా క్రొత్తకోడలితనం తగ్గలేదామెకు. నేనే ఏదైనా బలవంతంగా పని చేస్తే 'ఆడి పాడే రోజులు. ఇప్పుడే కోడలికి పనులు చెప్తున్నావా?' అని మామగా రనేవారు. అప్పుడు మీరు పెద్దవారైనా కొంటెతనం తగ్గలేదు. వంకర చూపులు, చిలిపి పనులు.... ఊఁ. ఏనాటికీ మరపురావు. ఇప్పుడూ అనుభవిస్తున్నట్టుగానే ఉన్నాయి. (అతడు తలతిప్పుకుంటాడు బాధతో)

ఇటు చూడండి, ఇటు, నా వైపు. నా ఆనందం భంగం చేయకండి. మీ మనస్సు గట్టి చేసుకోండి.... ఈ గదిలోనే కిటికీలోంచి ప్రసరించే వెన్నెల మనకెంతఆనందం కలిగించింది! ప్రతినెలా వెన్నెల పదిహేనురోజులు మాత్రమే. హోలీ, దీపావళులు మాత్రం ఏడాది కోసారి. ఆ పండగలనాటి ఆనందం!.... ఆ ఆనందాని కంతటికీ కారణం మీరు. మీ హృదయం. (హటాత్తుగా లేచి అటూ ఇటూ అతడు తిరుగుతుంటాడు.) నాకు తెలుసు. మీకిది బాధే. అయినా నాకోసం మీరు తప్పక వింటారు. కూర్చోండి. (కూర్చుంటాడు)

ఉన్నంతలో ఏ లోపమూ లేని సంసారం. అనుభవించగల హృదయాలు. సంతృప్తి. ఏ కోటీశ్వరుడికీ లభించని తృప్తి. ఆనందమూ అనుభవించాము. హృదయాలు పరిశుభ్రంగా ఉన్నాయి. అనుభవించాము. ఏమనుభవిస్తున్నామో తెలుసుకోవాలనే ఊహ లేకుండా సుఖం అనుభవించాము. సుఖానికి ఏం కావాలి? డబ్బక్కరలేదు. నిండు మనస్సు. తృప్తి. అవి ఉన్నాయి. (కొంచెం ఆగి) కష్టాలు రాలేదనికాదు. అప్పుడప్పుడు వంట పండక, పండినా సరిగా చేతికందక కష్టపడ్డాం. కాని అవన్నీ

గడ్డిపోచలా అనిపించేవి. కష్ట సుఖాలు చక్రాల్లా తిరుగుతాయి. ఆచక్రాలే మన జీవితంలో ప్రేమను మరీ గట్టిచేసినవి. కాని.... అత్తగారు పోవడం.... ఇల్లంతా చీకటి అనిపించింది.... మామగారు పోవడంతో ప్రపంచమే చీకటి అయినట్లయింది. ఇతర కష్టాలూ గలిగాయి. అయినా మీకు నేను, నాకు మీరు.... (అతనికి కన్నీరాగదు. వెంటనే తుడుచుకొంటాడు.) తరువాత మామగారి బాధ్యతలు మీకూ, అత్తగారి బాధ్యతలు నాకూ వచ్చాయి. తీరిక లేనట్లే అనిపించేది. కాని కష్టం అనిపించేదికాదు. పొద్దున్నే మీరు పొలంవెళ్లాక, మిమ్మల్నే ఊహిస్తూ, చేసే ప్రతి పనిలో మిమ్మల్నే చూస్తూ చకచకా పనులు చేసుకొనేదాన్ని. చేసిందేదో పెరుగువేసి పొలంలో మీకు తెచ్చి తినిపిస్తే, మీరు అప్పుడు చూచే చూపులు నాకు ఒక అమూల్యమైన ధనం లాంటివి. సాయంత్రం మీరు వచ్చాక మీకు చేసే సేవవల్ల ధన్యురాలనైపోయేదాన్ని. అలసివచ్చికూడా నాపై మీరు చూపిన ఆదరం అనురాగం పెన్నిధి నాకు. (పక్షి గఖాల్ని అతనులేచి ఇటూ అటూ తిరుగుతుంటాడు. దీపపు వెలుగు నీడలు అతని మొగాన పడుతుంటాయి.)

ఇంకెక్కువసేపు మిమ్మల్ని కష్టపెట్టను. నేనూ ఉండేట్టులేదు....ఆయాసం పెరుగుతోంది... (అతను ఆమె దగ్గరికివచ్చి కూచుంటాడు.)

ఎప్పుడూ ఏ కలతా కలగలేదు. సంతానం కలక్కపోతే భర్తకు ప్రేమ తగ్గుతుందంటారు. కాని అల్లాంటిదేమీ జరగలేదునాకు. ఎప్పుడూ మీరు నన్ను కొత్తపెండ్లికూతురుగానే చూచారు. మొదటి రాత్రినాటిలాగానే చూచారు.... కాని.... ఒకటే విచారం నాకు. ఈ పాప కలిగేప్పటికి అత్తమామలు లేకపోయారే అని. వాళ్లు మనుమరాలిని చూడాలనీ, దానితో ఆడుకోవాలనీ, భుజా లెక్కించుకోవాలనీ ఎంత అనుకొన్నారు! కాని.... వారిని సంతోషపెట్టలేక పోయాను. నేనే ఎప్పుడైనా విచారిస్తే అత్తగారే ఓదార్చేవారు నన్ను. అయినా ఈనాటికి ఆ కోర్కె నాకు నెరవేరింది. స్వర్గంలో అత్తమామలూ ఆనందించి ఉంటారు. గర్భం నిలిచినప్పుడు నాకెంత ఆనందం కలిగింది! పాప కదిలితే ప్రపంచంలోని చైతన్యం నాలో ఇమిడినట్టనుకునేదాన్ని. పాప పెరిగినాకొద్దీ నా ఆనందాని కంతులేదు.... కాని.... కాని.... పాపను పెంచే భాగ్యం నాకు భగవంతు డివ్వలేదు. అన్నిటినీ ఇవ్వడేమో భగవంతుడు. (అతడి కండ్లలో నీరు తిరుగుతుంది.) ఎందుకు బాధపడతారు? నాకోసం మీరేం చేయలేదు? అన్నీ చేశారు. ఫలితం మన చేతిలోదా? బాధ పడకండి, మళ్లీ జన్మలో మీకే భార్యగా కావాలనీ, ఆ అత్తమామలే దొరకాలనీ, భగవంతుని ఈ చివరికాలంలో ప్రార్థిస్తున్నాను. (అత డామెవైపు దీనంగా చూస్తాడు.)

అయితే, నా దొక్క కోరిక. మీరు తప్పక తీర్చుతానని మాటివ్వండి.... నామాట కాదనరు... (కొంచెం ఆగి ఆయాసం తగ్గించుకొని) ఈ పాపను తల్లిలేనిదాన్ని చేయకండి. నేను స్వర్గం వెళ్తాను. స్వర్గమే వెళ్తాను. మీరు భర్తగా దొరికాక నాకు నరకం ఎందుకు వస్తుంది? స్వర్గమే వస్తుంది. కాని ....స్వర్గంలోకూడా ఈ పాపకోసం నాకు విచారం లేకుండా చేయండి.... స్వర్గంనుండి మీ వివాహం చూచి ఆనందిస్తాను. పాపకు తల్లి— నా వంటిది— లభించిందిగదా అని సంతోషిస్తాను. (అతని చేయి వణుకుతుంది) అదేమిటి? ఎందుకు వణుకుతున్నారు? శాస్త్రం డెబ్బైఏదేళ్లదాకా పురుషుడి వివాహానికి ఒప్పుకుంది. మీకు అందులో సగంకూడా లేవు. (క్షీణ స్వరం) మీరు ఒంటరిగా ఉంటే నాకు.... నాకు.... స్వర్గంలోకూడా ఓ విచా....రం ఉంటుంది. నాకు.... నాకీవరం.... ఇవ్వండి.... నా ప్రేమను ఆమెలో నింప.... నీయం....డి.... మళ్లీ.... నన్ను మీకు.... సేవ చేయనీ...యండి... పాప...ను... పెంచనీ ...యం...డి...... (ఆమె వెల్లికిల పడిపోతుంది. కళ్లు మూస్తుంది. అతడు 'ఆఁ' అని అరువబోయి నోరు అల్లాగే తెరచి ఉంచుతాడు. ధ్వనిరాదు.)

తెర.

స్వేచ్ఛానువాదం: సుధాకరరావు.

# చర్చావేదిక

## 'కానినేయ' శబ్ద మసాధువా ?

శ్రీనాథ మహాకవి కానినేయ శబ్దమును భీమఖండములో రెండుసార్లు వాడియున్నాఁడు. "కాశికాపట్టణముమీఁదఁ గానినేయ" (2–114) "కార్యసంసిద్ధిఁబొందెదు కానినేయ" (3–213) "కన్యాయాః కనీనచ" అను పాణిని సూత్రము చొప్పున 'కన్యా' శబ్దమునకు 'కనీనా'దేశమువచ్చి 'కానీన' శబ్దము సిద్ధించును. కానినేయ శబ్దమే ప్రామాణిక కోశమందును లేదు. దీని సాధుత్వాసాధుత్వముల నింతవఱ కెవ్వరును జర్చించి యుండలేదు.

వైదిక పదానుక్రమ కోశమున (సంహితా భాగము, ద్వితీయ ఖండము) "కనీ - నాప (కన్యా)" ఇత్యాదిగా 'కనీ' శబ్దము చూపట్టుచున్నది. సూర్యరాయాంధ్ర నిఘంటువున 'కని' అను తత్సమ రూపము కలదు. దీనికి ప్రమాణముగా దండి కావ్యాదర్శ శ్లోకసంఖ్య చూపఁబడెను. కావ్యాదర్శమున నిట్లున్నది.

శ్లో॥ ఖాతయః కనికావేతే స్ఫాతయః స్ఫారవల్గవః
చన్ద్రే సాక్షాద్భవన్త్యత్ర వాయవో సుమధారిణః
(కావ్యాదర్శ. 3–111)

"కని! కుమారి! కన్యాకనీకుమారీ చేతి హేమచన్ద్రః" అని జీవానంద విద్యాసాగర భట్టాచార్య వ్యాఖ్య. ఈ 'కనీ' శబ్దమును మూలముగాఁ గొని కానినేయ శబ్దమును సాధింపవచ్చును.

"కళ్యాణ్యాదీనామినఙ్" ఏషామినఙాదేశః స్యాత్ ఢక్చ, కాళ్యాణినేయః "బాన్ధకినేయః" (సి. కౌ. 1131 సూ.) ఈ కళ్యాణ్యాదులలో 'కనీ' శబ్దము చేర్చనగును. "కళ్యాణీ సుభగా దుర్భగా...ఇనేయః" (ముగ్ధబోధ) ముగ్ధబోధ వ్యాకరణమున రజకీ శబ్దము కూడా 'కళ్యాణ్యా'దులలోఁ జేర్పఁబడి యున్నది. ఇది 'రాజతీ' శబ్దముకానోపును. "రాజతీ స్థానే రజకీతి లిపికర ప్రమాదః" అని శ్రీరామ తర్కవాగీశుని వ్యాఖ్య. జరతీశబ్దము నీగణములో గ్రిమదీశ్వరుఁడు పఠించినట్లు గిరిశచంద్రుని ముగ్ధబోధ వ్యాఖ్యానములో నున్నది. కాఁగా నీ "కళ్యాణ్యా"దులలో నితరశబ్దములు చేర్పవచ్చునని తెలియుచున్నది. అనఁగా నిది యాకృతిగణమన్న మాట. కావున 'కనీ' శబ్దము నిందుఁజేర్పవలయును. "కనీ + ఇనేయః = కాన్ + ఇనేయః = కానినేయః = కానినేయుఁడు" అని సిద్ధించును. సంబోధనములో 'కానినేయ' సాధువగును. ఇట్లు సాధించుకొనియే శ్రీనాథ మహాకవి ప్రయోగించి యుండును.

ఇట్టి స్థితిలో సూర్యరాయాంధ్ర నిఘంటువునందును 'కానినేయ'శబ్దము లేకుండుట వింతగానున్నది. సంస్కృత శబ్దములకు 'డుమువులు' చేర్చి యెక్కించుకొను నిఘంటువులలో నిట్టి లోపము లుండక తీరదు.

'కానినేయ' శబ్ద సాధుత్వమును గూర్చిన నా యీ యభిప్రాయ మెంతవఱకు సమంజసమో పండితులు పర్యాలోచింతురుగాక !

— గాండీవి.

## "నేటి కవిత - సంప్రదాయము"

### జిజ్ఞాస.

జూన్ 1960 జయంతి సంచికలో భారతీయ కవులు తిరిగి తిరిగి తుదకు సంప్రదాయ మార్గము నాశ్రయించు స్థితికి వచ్చినారనీ, ఈ సంప్రదాయ భావన– ఆధ్యాత్మికము– ఒక్కొక్క కవిలో ఒక్కొక విధముగ పర్యవసించినదని శ్రీ సుప్రసన్న వ్రాసినారు. ఆరుద్ర 'కాలము', శ్రీశ్రీ 'సదసత్సంశయము' వైదానికై ఉదాహృతములైనవి.

విశ్వ జిజ్ఞాస.

విశ్వనాథవారిది సంప్రదాయమార్గము. బాల్యమునుండి సంప్రదాయ సంస్కారములు వారిని తీర్చి దిద్దినవి. దానికి వారి 'జీవుడు' సిద్ధపడి 'వేదన'ను వరించినాడు. మార్గము సిద్ధము. గమ్యముకూడ సిద్ధమే. అనుమానమునకు, అవిశ్వాసమునకు, వాటివలన గలుగు వికార భావములైన అసంతృప్తికి, విరోధమునకు వారి ఎదలో తావులేదు. చిరపరిచితమైన మార్గమందు, తనకు లభించిన వేగముతో ప్రయాణించుచు, ఎన్నటికా యని ఎదురుచూచుటొక్కటే అచట మన కగుపించును. ఆర్షము, ఋషిసంపాదితము, సిద్ధమునైన విశ్వనాథ వారి మార్గములో అందుకే తామసము, తజ్జన్య వికారము కన్పించక ఒక బలము మనసునకు పట్టును.

శ్రీశ్రీ 'నిజంగానే...నిజంగానే' యని ప్రయాణము ప్రారంభించినాడు. నేనుకూడ తగినవాడ నేనని తర్కము చూపినాడు. తన అర్హతను చూపుటకు; లబ్ధియనుమానాస్పదము కాగా, విజృంభించి విప్లవముల, నెత్తురుల నాశ్రయించినాడు. చివరకు అనుభవమువలన జీవుడు వేదనపడినాడేమో. అదియు ఆధ్యాత్మిక భావనా ప్రభావమువలనకాదు. విరక్తి, విసుగు, పరాజయము వలన.

రెండవది.

విశ్వనాథవారి ఆధ్యాత్మము ఏకపక్షము కాదు. అనగా ఒకదాని నాశ్రయించుటకు ఇతరములను విరోధించుట కాదు. తన జీవుని వేదన తన జీవుని దే. ఒక్కొక్కని కొక్కొక్కరూపమున, ఒక్కొక్క దశలో ప్రాప్తి.

శ్రీశ్రీ వారు భౌతికవాదులు. అది పోయినదాక చూడవలె. శ్రీశ్రీజీవుని వి ్ర క్ష మెంతవరకు? అదియు చూడవలె. ఎందుకన శ్రీశ్రీ భావనకు ప్రారంభము అసంతృప్తి; విరోధము. ఏదికావలయును, అదెట్లు సాధ్యము అనునదికూడ రూపమేర్పడిన సత్యముకాదు. ఒక ఊహ, ఒక కల, దానికై తపన. అది జీవుని తపన కాదు. శరీరతపన. శరీరగతములైన భౌతిక ప్రవృత్తుల తపన. శ్రీశ్రీవారి జీవి భౌతికతాపమును దాటినాడా? దాటినచో ఆ తరువాత నే వారి ప్రయాణము నిజముగ ప్రారంభమగును. అప్పటివరకు వారు పడువేదన నిష్ప్రయోజకమే. ఎందుకన భౌతిక ప్రవృత్తుల తాపము లేకుండనే విశిష్ట సంప్రదాయ మార్గముపొందు అవకాశముండగా, శ్రీశ్రీవారినాళ్లు తపించినది తన తాపము ఒప్పుకాదని యెరుగుటకనియేకదా! కను క శ్రీశ్రీవారు 'సదసత్సంశయము'న ప్రకటించిన జీవుని వేదన సంశయపూర్వకమైన తాపమేగాని, విశ్వనాథ వారి జీవుని వేదనవంటి దగునా ?

నాకుచూడ సంప్రదాయ మార్గమింకను శ్రీశ్రీ గుమ్మమునుచేరలేదు. అస్తి నాస్తి జిజ్ఞాస ఇంకను ఉన్నది.

శ్రీ సుప్రసన్నగారన్నట్లు వీరిరువురు వెలువరించిన భావములకు పోలిక యున్నదాయనినా అనుమానము. పోలిక పదములలోనే కలదేమో!

— సదాశివ.

## ఆకాశవాణి

ప్రతి బుధవారమూ ప్రసారమయ్యే నాటికల్లో ఈ మధ్య హైదరాబాదు కేంద్రం రెండు అనువాద నాటికలను ప్రసారం చేసింది. ఒకటి ఘోషి, రెండు నియాన్ లైట్. మొదటిది తమిళంనుండి, రెండవది కన్నడంనుండి. ఇరుగు పొరుగు భాషల్లోంచి నాటికలను అనువాదంచేసి తెలుగువాళ్లకు రుచి చూపించడమనే సత్కార్యక్రమానికి హైదరాబాదువారు పూనుకోవడం మంచిదే. అయితే ఇక్కడ ఒక చిక్కు వచ్చింది. ఇతరభాషల్లోంచి అనువాదంచేసి తెచ్చేప్పుడు కొంత కాకపోతే కొంతైనా మంచి రచనలను అనువాదం చేయించటం మంచిది. కాని తక్కువరకపువాటిని అనువాదం చేయించడంవల్ల శ్రోతలకాలమూ, తెలుగు రచయితల అవకాశమూ వ్యర్థమవుతున్నాయి. ఈ విషయం ఇదివరకోసారి ప్రస్తావించబడింది ఈ శీర్షికలోనే. అయినా తప్పటంలేదు. తమిళంనుంచి అనూదితం చేయబడిన 'ఘోషి' అన్న నాటిక ఒకానొక తక్కువరకపు డిటెక్టివ్ నాటిక. పాశ్చాత్యదేశాల రచనలను ఆదర్శముగా పెట్టుకొని వాటి త్రోవలో అక్షరాక్షరంగా పోవడమే తప్ప మంచిరకమైన 'అపరాధ పరిశోధక' వాఙ్మయం మనదేశానికి అనుగుణంగా ఇంతవరకూ రాలేదు. అందుకనే క్రొత్తొక వింతగా ఒకటి రెండు సంవత్సరాలు సాగిన అపరాధపరిశోధక సాహిత్య సృజనకు తెలుగుదేశంలో సరైన స్థానం లేకపోయిందని కొద్దిరోజుల క్రిందనే అనుభూతమైన విషయం. దేశములో సాహిత్యస్థితి ఎల్లావుంది అని యోజించే తీరిక లేని ఆకాశవాణివారు, అందునా ఆకర్షణ ఏమాత్రమూ లేని 'దోషి' ని ప్రసారంచేసి 'అపరాధ పరిశోధక' సాహిత్యాన్ని పునరుద్ధరించే ప్రయత్నం వ్యర్థం. దేశానికి సరిపడని రచనలు ఆకర్షించలేవు, నిలువలేవు అన్న సత్యాన్ని ఆకాశవాణివారు గుర్తింపలేకపోవడం శోచనీయవిషయం కాదా మరి! ఇక దాని అనువాదంకూడా ఎగుడుదిగుడుగానే సాగిందితప్ప సాఫీగా లేదు. ఏమాత్రమో ఉన్న 'సస్పెన్సు'ను రచన చెడగొట్టింది. మరి రెండో నాటిక హాస్యనాటిక అని ఆకాశవాణివారనలేదు కాని హాస్యం కలుగని హాస్యనాటిక అది. మనస్తత్వశాస్త్రాన్ని ఏదో ప్రతిపాదించినట్లు భ్రాంతికలిగిస్తూ హాస్యప్రాయంగా తయారయిందది. అందులో హాస్యానికని చెప్పబడ్డవి ఏమాత్రమూ హాస్యాన్ని కలిగించేట్టుగా లేవు. హాస్యనాటికలకోసం ప్రత్యేకింపబడిన సమయం ప్రతి శనివారం రాత్రి. ఏ సమయంలో ఏ కార్యక్రమం ప్రసారించాలో నిర్ణయించుకొనికూడా నిర్వహించలేకపోవడం ఆకాశవాణివారి కలవాటైన విషయం.

ఈ అలవాటునుగూర్చి మరొక ఉదాహరణ: ప్రతి సోమవారం రాత్రి 'రసమయి' కార్యక్రమ ప్రసారం నిర్ణీతకార్యక్రమం. అది చాలాసార్లు తప్పించబడుతుంది. జూన్ 20 ఆదివారంనాడు రసమయిని నైగొలగించి హైద్రాబాదు కేంద్రం 'దాగుడుమూతలు' ఆడింది. దాగుడుమూతలు బుచ్చిబాబుగారి నాటిక. గంటకుపైగా సాగింది. తమ ఒకటి రెండు ఇదివరకు ప్రచురింపబడిన కథలను ఆధారంగా చేసుకొని బుచ్చిబాబు రచించిన నాటిక ఇది. గంటపైగా కాలంగడవడమేతప్ప రచయిత ఏంచెప్పాడో తెలియదిందులో. కొంత సంస్కరణ, కొంత భగ్నప్రణయం. కొంత నిరాగం. కొంత నాస్తికత్వం, కొంత ఆస్తికత్వం, కొంత మనస్తత్వం, కొంత......కలిపి 'సర్వాయణం'గా తయారయిందిది. భగవద్గీత శ్లోకాలు చాలా ఉదహరించబడ్డాయి. వెక్కిరించబడ్డాయి. చివరకు నాయకుడు, జీవితం- ఈ సామాన్యజీవితంనుండో, లేక మరెక్కడినుండో, ఎక్కడికో సహాభినిష్క్రమణం చేస్తాడు. మొత్తంమీద తనను తాను మోసంచేసుకొంటూ అవ్యవస్థిత చిత్తుడైనవాడు ఈ నాటికకు నాయకుడైనాడు కాబట్టి నాటికకూడా అవ్యవస్థితంగానే తయారయింది.

స్వంత నాటికలుకానీ, పరాయి-అంటే అనూదిత- నాటికలుకానీ ప్రసారం చేసేప్పుడు ఆకాశవాణివారు నెరపే తాత్సారానికి అవధి కనిపించదు. జూన్

16 వ తేదీన అఖిలభారత జాతీయ నాటకం ప్రసారమైంది. 'తులసీమాత' గుజరాతీ భాషనుండి. నాటక విషయం అల్లాఉంచి మొదలు ఒకమాట వ్రాయవలసి ఉంది. స్వర్గీయ మేఘానీ గుజరాతీ భాషలో రాసిన నాటకం తెలుగు అనువాదం చేసినప్పుడు ఆయన ఎంత వరకు వ్రాసాడో, ఎంతవ్రాసాడో, ఏమివ్రాసాడో దాన్ని మాత్రమే అనువాదం చేయడం న్యాయం. అయితే అది ఆకాశవాణివారు వదిలేసారుగదా. నాటకము చివర పింగళి నాగేంద్రరావుగారు 'గుణసుందరి' సినిమాకోసం వ్రాసిన 'అమ్మా! తులసీ, దయారాశి వమ్మా' అనే లీలపాడినపాట రికార్డు ప్రసారం చేయడం జరిగింది. ఆ నాటిక సందర్భానికి ఆ పాట సరిపోయిందేకావచ్చు. అంతమాత్రాన పరభాషీయుని రచనకు అది అంటించడం ఆ నాటకానికి కానీ, దాని రచయితకుగానీ, ఆ 'పాటకర్త' కు కానీ ఏ మాత్రం న్యాయం? పోనీ, గౌరవమైనాకలిగించే విషయం కాదు.

స్వంత నాటిక విషయం. జూన్ 21 న కార్మిక కార్యక్రమంలో గోపీచంద్ గారి 'గోదానం' ప్రసారమయింది. దీన్ని రూపకమని ప్రసారకులన్నారు కాని అది రూపకం కాదు. పట్టి స్వగతం. కొంత ప్రభుత్వం వారి జలవిద్యుత్ కార్యక్రమ ప్రచారానికి సంబంధించికూడా. రూపకం కానిదాన్ని రూపకం అనడం ఏ నాటికీ విడువని ఆకాశవాణివారి స్వంతధర్మం కాబట్టి, ఏమనుకోనక్కరలేదు. అయితే ఆ నాటిక చివర కీర్తిశేషులు శ్రీ అడవిబాపిరాజుగారి 'ఉప్పొంగిపోయింగోదావరి' అన్న పాట పాడించబడింది. ఆ ఉత్తమపురుష స్వగతానికి ఈ ప్రథమపురుషపాటకీ ఎల్లా పొత్తు కుదిరిందో ఆ రచయితకూ, ఆ ప్రసారకులకే తెలియాలి. మధ్య మనమెవ్వరమని, మనకు తెలియడానికి? కొందరు రచయితల రచనలమీద, సినిమా పాటలమీద ఆకాశవాణి వారికి నిరూఢమైన హక్కుదారుతనం, ఏ విధంగానైతేనేం? ఉండిఉండవచ్చు. ఆ మాత్రానికే వాటినన్నిటిని సందర్భా సందర్భాలూ, సామంజస్యా సామంజస్యాలూ గుర్తించకుండ ప్రసారంచేసే సాహసం ఆకాశవాణివారు తప్ప మరెవరు చేయగలరు? అది సాహసమనీ అనకూడదు. పట్టి అలవాటుమాత్రమేం.

అన్నందుకు రసమయి కార్యక్రమంలో జూన్ 13 వ తేదీన కొంత విషయాన్ని అందించగల వ్యాసం చదువబడింది. భాషా విషయికంగా, చారిత్రిక విషయికంగా, ఆంధ్రదేశ విషయికంగా పరిశోధన చేసేవాళ్లకు, చేయాలనుకొనే వాళ్లకూ లాభకరం అయిందది. అది 'సెకంజీ కైఫీయతు' లన్న నిడదవోలు సర్వేశ్వరరావుగారి వ్యాసం. కైఫీయతుల రచనలు అనేకమైన తత్త్తత్ప్రాంతీయ పదాలతో ఇమిడి ఉంటాయి. అనేకమందికన్న స్పష్టంగా సర్వేశ్వరరావుగారు శ్రోతలకు అర్థమయ్యేటట్లు, విసుగుకల్గని విధంగా చదివారు.

జూన్ 6 వ తేదీన విజయవాడనుండి సాహిత్య నందిని కార్యక్రమంలో కొలకలూరి ఇనాక్ గారి కథానిక ప్రసారమైంది 'కవి' అని. నిజానికది కథానిక కాదు. ఊహాత్మక రచన. ఈ మధ్య దారినబడుతున్న వచనపద్య ధోరణిలో నడిచింది. కేవల వచనానికి, కథానికారచనా భాషకి ఉండనట్టి లయ, కవిత్వ లక్షణాలూ ప్రతి వాక్యంలోనూ గోచరిస్తవి. ఇంతకుముందుకూడా కల్పనాత్మక రచనలని కొన్ని ఆకాశవాణివారు ప్రసారం చేసారుగాని. ఇల్లాంటిదాన్ని, కవితా లక్షణం కలదాన్ని ప్రసారం చేయలేదనిపిస్తుంది. భావనా లోకంలోని కవి, లోకంలోని కవియొక్క స్థితి, ఆ భావన, ఈ లోకమూ కవికి ఎల్లాంటి ప్రేరణకల్గిస్తుందో ఇందులో ఉంది. రెండు లోకాలమధ్య కవి ఎల్లా నిలువద్రొక్కుకుంటాడో ఇందులో చిత్రింపబడింది. ఇనాక్ గారి నాటికలవలెనే ఇదికూడా శ్రోతల్ని ఆకర్షించింది. కథాత్మక వచనపద్య మార్గంలో నిలిచింది. అదే కార్యక్రమంలో జూన్ 14 న హైదరాబాదు కేంద్రం ఒక కథ, కొన్ని పద్యాలు ప్రసారం చేసింది. ఈ కలగూరగంపతనం ఎందుకో అర్థంగాదు. ఇది ఆకాశవాణివారు నిర్ణయించుకొన్న పద్ధతి అనుకొందామంటే, విజయవాడ కేంద్రం ఈ పద్ధతిని అనుసరించడంలేదు. ఇద్దరు రచయితలకు అవకాశం కల్పించామని చెప్పుకోవడానికి తప్ప ఇంకేవిధా ప్రయోజనం లేదు. ఇది ఉక్తపూర్వమే. ఈ పద్ధతివల్ల ఒక గల్పికలాంటి కథ, అయిదారు పద్యాలు మాత్రమే వినడానికి వీలవుతుంది. ఒకసారి కవిత, ఒకసారి కథానిక, ఒకసారి వ్యాసమూ, ప్రసా

చేయవచ్చు. విజయవాడ కేంద్రం దాదాపు ఈపద్ధతినే అనుసరిస్తున్నది. రాజధాని నగరంలోని ఆకాశవాణి కేంద్రం ఆరాజధాని నగరంలోని కేంద్రాన్ని అను సరించదేమో? 14 న ఖండవల్లి బాలేందుశేఖరంగారి కథ, వెల్లండ ప్రభాకరరావు గారి పద్యాలు ప్రసార మయినాయి. కథ (గల్పిక అనడం న్యాయం) 'అస లుకు వడ్డీ' సమయం చాలదనుకొన్నారో, లేక నిజంగా చాలదో, శ్రోతలు అందుకోలేనంత వేగంలో గల్పికా పతనం జరిగింది. పద్య రచయితకూడా అల్లానే చదువ వలసివచ్చింది. ఈ ఇరుకిరుకు సమయాలెందుకు? అవ కాశం ఇవ్వదలచుకొన్నప్పుడు సరిగా ఇవ్వాలి. లేదా మానుకోవచ్చు. రచయితల కింతమాత్రన వచ్చే లోటే మీ ఉండదు. నిజంగా చూస్తే రచయితల లోటు నను ఆకాశవాణి తీర్చలేదుకూడా.

ఒకడు మోసంచేస్తూ జీవితాన్ని గడుపుకొంటు న్నాడు. వాడంతకుముందు చాలా కష్టాలు పడ్డాడు. కాబట్టి వాడాపనిచేయడం మంచిదే. ఫరవాలేదు అని అనడం ఒక విధంగా మోసాలు చేయడానికి మద్దత్తు ఇచ్చినట్లే అవుతుంది. ఏవిధంగానూ మోసానికి మద్దత్తు ఇవ్వకూడదనేది సర్వసామాన్యంగా తెలిసిన విషయమే. అయితే జూన్ 11 వ తేదీన హైదరాబాదు కేంద్రం ప్రసారంచేసిన 'బహుకాల దర్శనం'అన్న హాస్యవల్లరి కార్యక్రమం చుట్టుదారిన మద్దత్తు యిచ్చింది. రైళ్ల దగ్గిరా, బస్సుల దగ్గిరా వ్యక్తులు పరస్పరం మాట్లాడు కొనే మాటలువిని, ఆ వ్యక్తుల కొన్ని విషయాలు తెలు సుకొని, పరిచయం ఉన్నవాడిలాగా వాళ్ళతో కొన్ని కల్లిబొల్లి కబుర్లుచెప్పి మోసంచేస్తూ డబ్బు లాగుతున్నా డొకవ్యక్తి. ఈ విషయం చివరకు శ్రోతకు తెలిసి పోతుంది. అంతవరకే ఈ 'బహుకాల దర్శనం' అన్న నాటిక ఆగిపోతే హాస్యవల్లరికి తగినట్లుగా ఉండేది. లోకంలోని కొన్ని మోసాల పద్ధతులు తెల్పినట్లూ అయ్యేది. కాని రచయిత విషయాన్ని చివరకు గంభీ రంచేసి, ఆ మోసంచేసే వ్యక్తి జాతీయోద్యమానికంకి తమై, చివరకు బీదవాడై ఈపన్లు చేస్తున్నాడు. ఏంచే స్తాడుమరి అన్నట్లుగా పూర్తిచేస్తాడు. ఈ ముగింపు

కలిగిన హాస్యాన్ని భంగం చేయడమే కాకుండా, ఆ మోసాలవ్యక్తిని ఒక విధంగా సమర్థిస్తున్నట్లూ అవుతు న్నది. మరి ఇదెంతవరకు సమంజసం.? నాటికా రచ యిత దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

కొన్నాళ్లనుండి విజయవాడ కేంద్రంవారు కార్మి కుల కార్యక్రమంలో కొన్ని విచిత్రమైన శీర్షికలతో 'ఇంటర్వ్యూ'లు ప్రసారం చేస్తున్నారు. 'బ్రహ్మతో డాక్టరు'' 'మనువుతో న్యాయవాది' 'హనుమంతునితో వస్తాదు' వంటివి అవి. బలవంతపు హాస్యం ఇందులో ప్రవేశబెట్టబడుతోంది. ఒకసారే ఒక పదో, పదిహే నో ఇల్లాంటివి. మొదటే ఏర్పరచుకొని గబా గబా వ్రాయించి ప్రసారంచేస్తున్నట్టు కనిపిస్తుంది. వీటివల్ల కార్మికులకు ఎంత వినోదం కలుగుతోందో ఏమోకాని, కేవల కాలహరణం కన్న వీటివల్ల తెలిసే మంచి విష యాలంటూ ఉండవు. కార్మికుల కార్యక్రమం అంటే కార్మికులు పాల్గొనే కార్యక్రమమా? కార్మికులనుద్దేశిం చిన కార్యక్రమమా? ఈకార్యక్రమంలో కార్మికులు దాదాపు పాల్గొంటంలేదనే చెప్పవచ్చు, పైగా కార్మి కులకు అవసరమైన విషయాలను చెప్పటంకన్న, కార్మికు లను గూర్చి ఇతరులకు చెప్పే విషయాలే తొంభయ్యొ యిదు పాళ్లు. ఇతర కార్యక్రమాలు అంటే స్త్రీబాలల కార్యక్రమాలు స్త్రీ బాలులతో నిండి ఉన్నట్లు ఈ కా ర్యక్రమం కార్మికులతో ఉండడంలేదు. దీనివల్ల కార్మి కులకు న్యాయంగా కలిగేలాభం కలక్కుండా పోతుంది. మరీ లాభం కనిపించని ఈ విధంగా కార్యక్రమాలు ఎందు కాకాశవాణివారు నిర్వహిస్తున్నారో ఆ అధికారు లకే తెలియాలి.

దేశములో ఈమధ్య కొన్ని రోజులు చైనా గొడవ వ్యాపించింది. దాంతో ఒక నాటిక తయార యింది. జూన్ 8వ తేదీన విజయవాడ కేంద్రం దాన్ని ప్రసారంచేసింది. 'ఎవరు విజేత?' ఆనాటిక. దేశంలో జరిగిన కొన్ని విషయాలపై నాటికలు రాయవచ్చు, కాని అది దేశానికి ఉద్బోధకంగా ఉండడం అవసరం. ఈ నాటిక ఏదో ధర్మంఅనీ, దయాఅనీ, చైనారాయబారికి భారత దేశపు సరిహద్దులను కాపాడే పౌరుషవంతుడు

లొంగిపోయినట్లుగా ఉంది. ఆ రాయబారి ప్రజలను బాధిస్తుంటే తాను వారికిలొంగి ప్రజలబాధ పోగొట్టినట్లుగా, అదే ఆ సరిహద్దు రక్షకుడి కర్తవ్యంగా ఈ నాటిక బోధిస్తుంది. ఆ రాయబారికి కొన్నేళ్ల తరువాత ఆ రక్షకుడు కనిపించి తానే విజేతనని నిరూపించుకుంటే దేశానికి కలిగిందేమిటి?... మన జాతి బలహీనమైనదని నిరూపించడానికే ఈ కథ పనికివస్తుంది. జాతీయశక్తిపై దెబ్బతీయడానికే ఉపయోగిస్తుంది. ఆ టెస్టు చక్రవర్తి సరైనకారణం ఉంటేకాని చైనా రాయబారికి సాయం చేయనంటాడు. ఆ సరైనకారణం ఏమిటో ఆ రచయితకీ, ఆ చక్రవర్తికే తెలియాలిగాని నాటికవిన్న శ్రోతకు తెలియదు. చక్రవర్తి రాయబారికి సాయం చేస్తాడు. ఏదో చరిత్రగాథను నాటికీకరిస్తున్నామని తృప్తి పడితే పడవచ్చుకాని, ఏ మాత్రమూ ప్రయోజనం కలిగించని, చూపని నాటిక ఇది. రచన, వింజమూరి శివ రామారావుగారు.

జూన్ 11 వ తేదీన 'రుక్సానా' అన్న చారిత్రిక నాటిక మద్రాసు ప్రసారం చేసింది. రచన బాగున్నా నిర్వహణ, వాచికమూ నాటికను అనాకర్షకంగా తయారుచేశాయి. పురుషోత్తమ కంఠధారి, మాట్లాడవలసిన ధోరణి స్వరం అలెగ్జాండర్‌లో, అలెగ్జాండర్ వినిపించవలసిన పద్ధతి పురుషోత్తముడిలో ఉన్నాయి. అలెగ్జాండర్ ఏదో ధ్వని వినిపిస్తోందని సెల్యూకస్‌తో అంటాడు. నాటిక రచనలో బయట కోలాహలము' అని కుండలీకరణంలో ఉండవచ్చుకాని శ్రోతకుమాత్రం వినిపించదు. అంటే కోలాహలాన్ని గూర్చి నిర్వాహకులు ప్రమత్తులన్నమాట. ఇల్లావుంది నిర్వహణ.

ఇవ్వన్నీ వదిలితే మే నెలలో కీర్తిశేషులు శ్రీ నండూరి సుబ్బారావుగారి స్మృత్యర్థం ఉభయ (విజయవాడ - హైదరాబాదు) కేంద్రాలు 'ఎంకి పాటలు' ప్రసారం చేశారు. అందులో పాకాల సావిత్రీదేవి, గజనిగార్లు పాడినవి విన్న తరువాత ఎంకిపాటలను వినాలంటె ఉండే ఆత్రం ఉత్సాహంకూడా నశించేంతపని అయింది. ఇంక ఏపాటలను - ఏ అప్రసిద్ధాలనుగూర్చి అల్లాచేసినా ఫరవాలేదనుకుంటే అనుకోవచ్చుకాని, దేశంలో లబ్ధప్రతిష్ఠులయిన నండూరివారిపట్ల ఇదెంత సమంజసమో శ్రోత నిర్ణయించలేడు. నిర్వాహకులు నిర్ణయించాల్సిన అవసరంకలవారు కారు. ప్రసారం చేయడంతప్ప, ప్రసారాన్ని నిర్వహించడంలో బాధ్యత ప్రసారకులు తీసుకొన్నట్లు కనిపించదు.

— పామీరి.

# లోలోపలి ఆలోచన

ఏ సమయమందు దేనిని నమ్మినచో దానిని ప్రచారము చేయుటయన్నది ఉత్తమత్వ లక్షణముగా భాసించుచున్నది. అది చిత్తశుద్ధికి సూచకముగా చెప్పబడుచున్నది. ఇట్లే వివిధసమయములందు నమ్ముటయన్న దానివలన, ఒక కాలమునందు తాను నమ్మినదానికి, కాలాంతరమునందు తన కేర్పడిన నమ్మకమునకు విరుద్ధభావ మేర్పడుట సంభవించును. అప్పుడా నమ్మినదాని యొక్క ప్రచారము మొదటి ప్రచారములో ఖండించుచున్నది. దీనివలన మొదటి ప్రచారము వలన ప్రభావితులయిన వారిని ఇప్పటి ప్రచారములో తాను ప్రతారించుట జరుగుచున్నది. నష్టము ప్రభావితులకు. ప్రతి వ్యక్తియు సమ్యగ్విచారము చేసియే యేవిషయమునైనను నమ్మవలసియుండునన్నది ప్రతి ప్రచార సందర్భమునను వినబడునదియే. కాని లోక మట్లుకాదు. ఒకడు కొన్ని కొన్ని కారణములచే గొప్పవాడుగా లోకమునందు పేరుపొందును. అప్పుడు లోకము వాని ననుసరించుటకే యత్నించును. ఈ లోక సామాన్య లక్షణ మనాదినుండి యున్నదే. ఆ గొప్పవాడని యనుకొన బడినవాడు కాలాంతరమందు తన విశ్వాసమును మార్చుకొన్నచో నీ ప్రభావితులు కింకర్తవ్య విమూఢతా పీడితులగుచుందురు. వీరియొక్క జీవితమునందు అవ్యక్త స్థితి యేర్పడును. అసలాగాక నే నీ సమయమున దీనిని

నమ్ముచున్నానని సమయసమయమునకు పూర్వ విశ్వాస విరుద్ధ భావములను వ్యక్తీకరించుట, నాగొప్పవాని మనస్సు యొక్క అవ్యవస్థితియే తెలియును. సత్యమన్నది మాటి మాటికి మారదు. మారుటయన్నచో తెలిసిన సత్యమునందు సత్యత్వము లేకపోవుట. సత్యము సుష్ఠుగా నెరుంగని ప్రచారము లోక ప్రతారణమే యగును.

ఈ ప్రతారణయన్నది బహు విధములుగా లోకమునందు విలయ తాండవము చేయుచున్నది. ఒకడొక సిద్ధాంతము నీ ప్రతారణకు సాధనముగా తీసికొనును. మరొకడు జాతిని గ్రహించును. వేరొకనికి వృత్తి ఉపయోగపడుచున్నది. ప్రతారణమన్నది ప్రారంభము కానేకూడదు, అయినదా, లోకమునందు దాని కుపయోగపడని విషయమనుచు నుండదు. ఉపయోగించుకొని వాని బుద్ధి యందీ శక్తియున్నది.

ఈ ప్రతారణమున అదిచేయువారు వివిధములయిన పేరులతో దానియందలి దోషమును కప్పిపుచ్చుటకు ప్రయత్నముకూడ జరుగును. అది చిత్తశుద్ధి యనును, జాత్యుద్ధరణ యనును, వృత్త్యభివృద్ధియనును, లోకోపకార మనును. చివరకు ప్రతారణ కాదని చెప్పుకొనును.

ఏది ఎట్లయినను అది నెరపువాని ఉద్దేశ్యమును, దాని గుణదోషములను కాలము నిర్ణయించును. కాలము బలవత్తర మయినది. జరుగుచున్న సర్వ విషయములందలి ఉచ్చనీచత్వముల నది నిరూపించును. నిరూపించినను దాని నంగీకరింపని ఆత్మ విశ్వాస దురభిమాను లెప్పుడు నుండనే యుందురు. తేభ్యో "నమోవాకం ప్రశాస్మహే." అంతే.

బహు విధములైన వాంఛలు ఊహలు కలుగుచుండును. వీని సాఫల్యము కొరకు సర్వదా జీవి యత్నించుచునే యుండును. ఆ వాంఛలు, ఆ ఊహలు ఎట్టివన్న యాలోచన, విచారముకన్న, వాటి సాఫల్యమునందే సామాన్యముగ జీవికి ఆస్థ అధికము. అవి యెట్టివయినను, వాని గూర్చిన ప్రయత్న మెట్టిది, యెంతటిదయినను, వాని సాఫల్యము జీవి యనుకొన్నట్లు గలుగుటలేదు. అతని యత్నఫల మతని యధీనములో నుండుట లేదు.

యథార్థమున కట్లున్నచో లోక వ్యవహారము బహు విధములుగా భిన్నాభిన్నము లగును. "చిత్తాలోలమ్ములు నూహాసంతతులు జీవాధీనముల్ స్వల్పముల్." ఈ యధీనములయిన స్వల్పముల యొక్క తత్తత్కాలల సాఫల్యము, సర్వము తన యధీనములోనిదే యన్న మిథ్యాగర్వ హేతుభావము జీవికి కలుగుచున్నది. దానితో సర్వస్వామిత్వము వ్యక్తీకరించబడును.

లోకమునందలి సర్వ ప్రవృత్తులకు హేతువయిన ముఖ్యభావము కామము. లక్ష్యభూతమయిన వస్తు వ్యక్తి విషయ భేదములనుబట్టి యనేక రూపములుగా నిది పర్యవసిత మగుచున్నది.

ఆశ యన్నది దీనియొక్క యొక పర్యవసానము. అవధులను దాటనట్టి యీ కామ భావన నష్టహేతువు కాదు. అవధులు దాటినప్పుడిది క్రోధాదులకు ఉత్పత్తి స్థానమగుచున్నది. లోకమందివి కామమంత మూలభూతభావములుగా కనిపించునంత గాఢముగా వ్యాపించినవి. తన కున్న యీ కామాదులు బహిర్వ్యక్తములు కానీయకుండ బహువిధావగుంఠనాచ్ఛాదితములుగా చేసి, అడ్డుత్రోవన వానిని తీర్చుకొను ప్రయత్నము వ్యక్తి చేయుచుండును. అప్పుడు ప్రతారణముయొక్క అవసరము కలుగుచున్నది.

ఒకని కధికారకామ మున్నది. దానిని వాడు వ్యక్తపరచడు. అధికారమునకు తాను వచ్చుట లోకోపకారమునకే యనును. అధికారమున కిదివరకు వచ్చినవారును, రాబోవువారును అట్లే యనుట జరుగుచున్నది. కాని, లోకోపకారమెంత జరుగుచున్నదో చూచుచునే యున్నాము.

ఉపకారముమాట యట్లుంచి, యపకారము జరుగకున్న చాలు. కాని యధికారము నిల్పుకొనుటకు జరుగు యత్నములలో నా యపకారము, అది పొందువానికిని తెలియనంత సుకుమారముగా జరుగుచున్నది. తత్కాలమునం దది లాభమట్లు కనిపించును కాని వి

మునకు లాభము కాదు. తరతరములదాక వ్యాపించు దుర్భావనాబీజావాపనమా లాభాభాసమున్నది.

సుఖమునకు దుఃఖమునకు కారణములు స్త్రీ, శ్రీ యన్నది ప్రచారితమయిన విషయము. స్త్రీలు హేతువులుగా సామ్రాజ్య నాశనముకూడ చెప్పబడుచున్నది. వానికి కీర్తి, అధికారమన్న రెండింటిని గూడ జోడింప వలయును.

వీనిముందు పూర్వద్వయము కొంత తగ్గినట్లే కనిపించును. ఔరంగజేబునకు స్త్రీ వాంఛ లేదు. ధన వాంఛ లేదు, కీర్తివాంఛ, అధికారవాంఛ యన్నదే వాని సామ్రాజ్యము కూలిపోవుటకు హేతువులయినవి. ఈ కీర్తివాంఛ, విచిత్రమైనది. వాని కీర్తి వాని మతమునకు సంబంధించియున్నది. మత ప్రచారమన్న దానితో నాచ్ఛాదిత మైనది. అందువల్ల నది కీర్తివలె గాక మతమువలె భాసించును. మతనిష్ఠమైన బుద్ధి యొక్క లక్షణములు సర్వత్ర యేకవిధముగా నుండుట లేదు. తనకు కీర్తిని సంపాదించుకొనటకు చేయు యత్నములుకూడ విచిత్రములుగా నుండును. ప్రఖ్యాత బెంగాలీ నవలా రచయిత శరత్ బాబు తాపలేనని తనను గూర్చి తానే విచిత్ర కథలను వ్యాపింపజేసెడివాడట.

ధనము సుఖ హేతువుగా కనిపించును. దానికన్న కీర్తి ఆనంద హేతువు. ధనము వెచ్చించి కీర్తిని సంపాదించవచ్చును. ధనము వెచ్చించినను కీర్తి లభింపక పోవుట లోకమునందు కన్పించుచున్నది.

కీర్తి కొరకు జను లెంత ప్రయత్నము చేయు చున్నారో, కీర్తికూడ జనులను చిత్ర చిత్రముగ నాడించు చున్నది. ఒకనికి వాని కీర్తి వాడు బ్రతికి యున్నంత వరకే యుండును. ఇంకొకనికి వాడు అధికారమందున్నంత వరకే యుండును. వేరొకనికి బ్రతికి యున్నంతవరకు కీర్తి రాదు. చచ్చిన తరువాత వచ్చును.

చచ్చిన తరువాత వచ్చిన కీర్తివలన ఆ కీర్తిమంతునికి కలుగు లాభము లేదు, ఏదో స్వర్గ సుఖమున్నచో తప్ప. కొందరి కీర్తి వారి స్థితిక మించివచ్చును. కొందరికి రావలసినంత రాదు. వాని పేరా ఊరివారికే నీమితము. వాడా ఊరిలో దుష్టుడు. ఇతరత్ర వానికి కీర్తి. జనుల కీర్తి మధ్య సంబంధముయొక్క వైచిత్రి వ్యక్తికి వ్యక్తికి భిన్నముగా నున్నది.

కాలాంతరమున కీర్తి లభించిన వాని స్థితి చాలా చిత్రమైనది. వాడేదియో జీవితమంతయు బాధపడును. ఒకానొక యనుకొన్న దానికొరకు, దానివలన నేదో లోకము బాగుకొనునని యనుకొని చేయును. వాడు దాని కోసము గుండెలు ఎండిపోవునట్లు కృషి చేసి ఏమియు సాధించలేదనుకొని విచారముతో జీవితమును త్యజించును. ఆ కాలాంతరమున లభించిన కీర్తివలన నేమి లాభము ? వాని శరీరము పంచభూతములలో కలసిపోయినదాయె! వాని లోకోపకారవాంఛ యాతని శరీరము దానియందలి సంస్కారముల నాశ్రయించినదే కాని కేవలము జీవి నాశ్రయించినది కాదుగదా! ఒకవేళ యాత్మవాదులనెడి జీవుడున్నను వానికీ కీర్త్యాదులు పట్టవు.

ఈ కీర్తికి వాని మనస్సు అన్న పదార్థము, గాని నాశ్రయించిన వాసనలు ఈ గగనములో, తేజస్సులో నాయువులో మిగిలియున్నచో నాచోట్ల సంతోష రేఖలు కానిపించునేమో. అది సంతోషమో, తృప్తియో, యిదమిత్థమని చెప్పలేము.

ఒక విధముగా చూచినచో ఈ సర్వమైన లోకము ఒక వ్యర్థమైన ప్రవృత్తిలోనున్నది. ఒక కీర్తి, ఒక ధనము, ఒక సుఖాభాసమైన అనుభూతి, యివి కోరికలు. ఈ కోరికల ఫలము ఎంతవరకో ఎవ్వడును చెప్పలేడు. శాశ్వతముగా కల్గని ఈ సుఖానుభూతులు తరువాత దుఃఖానుభూతులకు కారణము లగుటలేదా? వీనిని సాధించుట కెంత దుఃఖమో, సాధించిన తరువాత, వాని ననుభవించుటయైన తరువాత, మనస్సులో నేర్పడ్డ "ఖాళీ"ని భరించుటకుకూడ యంతే దుఃఖము. ఈ విధముగా శరీరి సర్వప్రయత్నములును దుఃఖ సాధ్యములు, దుఃఖ ఫలములని తేలును. ఈ దుఃఖమునకు మధ్యగల కించిత్సుఖరేఖ కొరకేనా ఈ సర్వ ప్రపంచము కల్పింపబడినది !

# గ్రంథ సమీక్ష

## గీతాంజలి.—

రవీంద్రుని పేరుతో గీతాంజలీ, గీతాంజలి పేరుతో రవీంద్రుడూ గుర్తుకొస్తారు. అంతర్జాతీయ ఖ్యాతి నందుకొన్న ఒకే ఒక భారతీయుల గొప్పకవి రవీంద్రుడు. ఆయన రచనల్లో గీతాంజలి శిరోభూషణం.

గీతాంజలియొక్క గొప్పతనం విషయంలో చాలా భేదాభిప్రాయాలు ఉన్నాయి. దానికి వచ్చిన "నోబెల్" బహుమానమే స్థాయిగా దాన్ని గొప్ప గ్రంథంగా నిర్ణయించడం కూడదు. కాళిదాసు తరువాత రవీంద్రునిడంత గొప్పకవి ఈ దేశంలో పుట్టలేదనే వాళ్లనుంచీ — టాగూరు కవే కాదు. గీతాంజలికంటే 'వాకే వీడు' అన్న నవలే చాలా గొప్పదనీ అన్నవాళ్లదాకా ఉన్నారు. గీతాంజలిలో భగవత్తత్వం ఏమీ కొత్తదికాదని, భారతీయుల నిత్యజీవనంలో జీర్ణమైపోయిందేననీ, వేదాలనుంచి యివాళ్లదాకా వచ్చే రచనలన్నింటిలో తాత్త్వికధార ఉంటునేఉందనీ టాగూరు ప్రత్యేకత ఏమీలేదనీ ఒకవాదం. టాగూరు ఒక 'లిటరరీ కరిరిస్టు' అన్నారు వీళ్లు. రచనలో కానవచ్చే మిస్టిక్ లక్షణం అసలు కవిత్వమే కాదని అది అంత గొప్పదైతే "గూటిలో చిలకేదిరా, ఓరన్నా, గూడూచిన్నాబోయెరా" అన్న మాదిరి రచనల్లో ఇదిఉందనీ, యివి కేవలం బిచ్చగాళ్లు పాడుకునే పాటలు, కేవలం ప్రచార సాహిత్యంకిందికే వస్తుందని ఒక పద్ధతి.

మరొకమార్గమున్నది. ఈ మార్గాన్ని అనుసరించే వాళ్లకు టాగూరు ఒక సామాన్యకవి. వీళ్లు అంటారూ,

---

మూలం: శ్రీ రవీంద్రనాథ టాగూరు
అనువాదం: శ్రీ గుడిపాటి వెంకటచలం
అనుమేళవ: శ్రీ సంజీవదేవ్ (150 పుటలు)
ప్రచురణ: మైత్రి గ్రంథమాల. విజయవాడ—2.

ఒక మహావస్తువును ఔచిత్యపూర్ణంగా ఉదాత్తంగా నిర్వహించి రసమును వ్యంజింపజేసినప్పుడే మహాకావ్యమవుతుంది. రసనిర్వహణ మహాకావ్యంలోకాని సాధ్యముకాదు. మహాకావ్య నిర్వహణచేయనివారు మహాకవి కావడానికే వీలులేదు. టాగూరు రచించినవి కావ్యాలే కావు, కేవల భావవిస్తరణలు. భావ వ్యాఖ్యానాలు, భావ చిత్రణలు యివికేవలం ఊహానుమించి మనస్సులో రసస్థాయిని అందుకోవు. కొంచెం వస్తువాసనఉండి సక్రమమైన నిర్వహణగల మేఘదూతమే — కాళిదాసంతటివాడు రాసింది — ఖండకావ్యమైతే ఇవన్నీ కావ్యాలుకావు. భావములు చిత్రించినంతలో కవి శబ్ద వాచ్యుడేకాని మహాకవిగా అంగీకరించము — అని.

పూర్వ తాత్త్విక రచనల్లో ఒక భావనాధార ఉన్నది. దానికో సంప్రదాయం ఉన్నది. అచల మతమో, అద్వైతమో, వైష్ణవమో, వీరశైవమో ఏదో ఒక మతం, ఒక తాత్త్విక సిద్ధాంతం, ఒక ఆచార్య పరంపర వీటి నాశ్రయించి యీ రచనలు చేయబడ్డవి. కాని గీతాంజలి యిలా ఏదో మార్గానికి చెందిందికాదు. పరస్పర విరుద్ధములైన తాత్త్విక సిద్ధాంతాలు ఈ రచనల్లో ప్రతిపాదింపబడతవి. కొన్నిచోట్ల ఒకే ఖండంలోనే విభిన్న భాగాల్లో — ఒకచోట అద్వైతము, ఒకచోటు విశిష్టాద్వైతమూ — విభిన్న వేదాంతమార్గాలు ప్రవచింపబడతవి. ఈ పరస్పర సమన్వయంలేని భావాలను ఆశ్రయించిన రచన ఏమి ప్రబోధిస్తుంది, మనస్సుని అవ్యవస్థలో పెట్టడంతప్ప. తను చెప్పదలచిందేదో తానే స్పష్టంగా ఊహించకుండా ఏదో కాల్పనిక జగత్తులో ఉండి ఊహలయెడల నిగ్రహంలేక యథేచ్ఛా ప్రవృత్తములయ్యేటట్లు వాటిని రచిస్తే వాటిస్థితి అలాగే ఉంటుంది. ఈ విధంగా ఈ గ్రంథంలో వేదాంతభాసతప్ప అసలు వేదాంతమేమీలేదు. ఇది ఒక [illegible]జమ్ — ఇదీ ఒకపద్ధతి వారి వాదం.

తాత్త్వికమైన రచనల్లో వాడే పరిభాషా, ప్రయోక్తములయ్యే ప్రతీకలూ చాలకాలం పూర్వంనుంచీ వస్తున్నవే "ద్వాసుపర్ణా సయుజా" ఇత్యాదిగా వైదికంగానే వస్తూవున్నవి. చైతన్యాదులకూ, [illegible]

రాదులకూ చెందిన మధుర భక్తిమార్గమూ ఉండనే ఉన్నది. ఈ ప్రతీకలన్నీ త్యజించి తన యిష్టంవచ్చిన విధంగా తనఊహాలను వెల్లడించడం టాగూరు చేశాడు. చిరానుగతంగావచ్చే ప్రతీకలద్వారా కలిగే అర్థస్ఫూర్తి కొత్త కొత్త ప్రతీకలు, అవీ ఖండఖండానికీ మారేవీ అయితే పాఠకునిమనస్సునుపట్టుకోలేవు. అది గీతాంజలి రచనలో దోషంఅని మరొక వాదమూ.

ఉపాసన ఎప్పుడూ సగుణుడైన పరబ్రహ్మనే ఆశ్రయిస్తుందికాని నిర్గుణ పరబ్రహ్మనుకాదు. అందుకే శంకర భగవత్పాదులు శివానందలహరి, సౌందర్యలహరి మొదలైన స్తోత్రాలు రచించి సగుణోపాసనచేశారు. వ్యావహారికదశలో ఈఉపాసన తప్పనిసరి. ఈగీతాంజలిలో పరమేశ్వరునకు రూపం యివ్వబడలేదు. రూపం లేనిచోట గుణములు ఉండవు. ఎప్పుడూ గుణములు రూపాన్నాశ్రయించే ఉంటవి. ఇందులోని ప్రభువునకున్న కరుణా, సర్వప్రభుత, వరప్రదాతృత, మొదలైన కల్యాణగుణములు నామరూపవిశిష్టుడైనవాడికే చెల్లుతవి. ఆ నామరూప కల్పన చేయలేక ఈకవి తన రచనను వ్యర్థంచేశాడు - అని ఇంకొక పూర్వపక్షం.

ఈ విధంగా ఉండే గీతాంజలిమీది పూర్వపక్షాలన్నింటికీ సమాధానం చెప్పడం కష్టం. ఈ 'గీతాంజలి' అనువాదకులూ, ఆధ్యాత్మిక మార్గంలో సాధన చేస్తున్నవారూ విన చలంగారు ఈ గ్రంథానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో గీతాంజలి ఎలా అర్థం చేసుకోవాలన్న విషయంపై వ్రాశారు. ఈ ఉపోద్ఘాతంకూడా ఈ పూర్వపక్షాలన్నింటిని స్పృశించలేక పోయింది.

"గొప్ప కవిత్వ సృష్టిగాని, అనుభవంగాని మనసు వెనక ఎంతో లోతున ఉండే **Sublime or Super plane** లో జరుగుతుంది. మనసుకి తెలిసేది స్వల్పం. గీతాంజలి అంతరార్థం చలానికేం తెలుసు? టాగూరు కెంతమాత్రం తెలుసు?" (14 పుట). ఈ మాదిరి చెప్పబడేచోట వాదించడమే కష్టం. సాహిత్యలోకంలో ఎప్పుడూ వాగర్థముల కవినాస్థితియే. వాస్తవకతితంగా అర్థం ఉండటం అంటూ ఉంటే అది సాహిత్య పరిధినించి దాటినట్టే. మిగిలిన విషయమంతా వైయక్తికములైన ఊహామార్గాల నాశ్రయించి వుంటుందీ భావనా ప్రవృత్తి. వాచ్య లక్ష్య వ్యంగ్యార్థాలను దాటి, శ్రోతలో కొత్త అర్థమును, లేదా ఒక అనుభూతిని సృష్టించుతుంది అనే విషయం సాహిత్య పరిధిలో అంగీకార్యంగా గోచరించదు. వాచమర్థో నుధావతీత్యాది భవభూతి వాక్యము తన వ్యంగ్య సామర్థ్యం వల్ల శ్రోతయందీ యర్థ విశేషమును ప్రతిపాదిస్తున్నది. ఇది మిస్టిక్ కవితయొక్క లక్షణమో యేమో. అందులోనూ అక్కడి ప్రతీకలవల్ల అర్థం భాసించుతూనే ఉండటం చాలా అవసరం.

**15** వ పుటలో "కవి టాగూరు ఎన్నో ఇమేజరీలనీ, ఉపమానాల్నీ, సింబల్సునీ ఉపయోగించి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయాలని చూస్తాడు. తక్కిన వారికిలె ఇతని ఈశ్వరునికి ఓ రూప మియ్యాడు. ఆయనకై ఓలోకాన్ని సృష్టించడు. కనుక తక్కిన భక్తకవులకిన్న ఈ యత్నం క్లిష్టం." ఈ విషయం పైప్రశ్నల్లో చివరి ప్రశ్నను స్పృశించుతున్నది. కాని సమాధానమీయడం లేదు. కవి ఉపమానాలు వాడతాడు, ఇమేజరీలని వాడతాడు కాని రూపమివ్వడు. ఇవి వాడినవాడు రూప మెందుకివ్వడు? రూపమిచ్చి ఉపాసించిన మీరా, కబీర్, రామదాసు, త్యాగరాజులు ఏంతక్కువ **Plane** లో ఉన్నారు. వ్యర్థమైన ఈ శ్రమ ఎందుకు? రూపాశ్రితమైన ఉపాసనయందు విరోధమా? లేక దాని అవసరం లేకపోవడమా? టాగూరును దీనినుంచి నిరోధించింది? అల్పాత్ములకు చెందిన దీని విరోధమున్నది. సృష్టి అంతలోనూ సర్వేశ్వరుణ్ణి చూడగల టాగూరు దీన్ని విరోధించడం మనం భావించలేము. దాన్ని అనవసరంగా భావించి నిర్గుణమైన బ్రహ్మ నెరిగిన వాడు (ఎరిగినవాడనగా అనుభూతి పొందినవాడు) కాబట్టి అలా చేశాడా అంటే ఆ స్థితికి పోయినవాడు జీవన్ముక్తుడే. వాడికి కావ్యరచన చేసే స్థితి కలుగదు. అందువల్ల ఈ పూర్వ పక్షం పూర్వపక్షంగానే మిగిలిపోయింది. ఇంకొకటి 'టాగూరు ఆధ్యాత్మపథం'ను గురించిన ప్రశ్న.

ఈ విషయాన్ని గూర్చి పీఠికలోని వాల్గవ

ఖండంలో శ్రీ చలంగారు వివరించారు. "ఒకడైన ఈశ్వరుడే ఇన్ని రూపాల సృష్టిని పొందాడు. ఇట్లా విభజితమైన ప్రతి భాగమూ తాను స్వతంత్ర వ్యక్తిననే మాయలో పడ్డది. ఈ ప్రపంచ మంతటా ఒకటే ప్రాణశక్తి." ఈ విధంగా వ్యాఖ్యానం సాగుతుంది. ఈ వ్యాఖ్యానాన్ని జాగ్రత్తగా పరిశీలించితే యిది అద్వైత మార్గంలో సాగినట్టుగా గోచరించుతుంది. అన్ని ఖండాలలో నీవు, నేను అనే భేదం చాలా స్పష్టంగా గోచరిస్తుంది. ఇది ద్వైతము. ఈ ద్వైతము కూడా అద్వైత సాధనలో ఒక భాగంగా స్వీకరించాలి. ఎక్కడో క్వాచిత్కంగా తప్ప ఈ అభేదాన్ని ప్రతిపాదించడం గోచరించదు.

టాగూరు ఆధ్యాత్మిక పథం చాలా చిత్రమైంది. ఈశ్వరుడు తన ఆనందంకోసం సృష్టించుకున్నాడు. ఈ సృష్టి అంతా ఆనంద నృత్యం. జీవుడూ, ఈశ్వరుడూ అనంతమైన విరహాన్ని పొందుతారు. జీవుడి ఆత్మార్పణే మోక్షం. ఈ జీవుడు ఈ లోకాన్ని ద్వేషించడు. లోకంలో అంతటా పరమేశ్వరుని సాన్నిధ్యాన్ని భావన చేస్తాడు. ఈ భావనాశక్తివల్ల లోకం అంటే బాధలూ, బరువులూ మాత్రంకాక వీటికి అతీతమైన పరమేశ్వర లీలగా గోచరిస్తుంది. అందువల్ల ఈశ్వరార్పితంగా, ఆయన లీలకోసం ఉద్దేశించి సర్వకర్మలూ జీవుడు చేస్తాడు. ఇదంతా 'నిష్కామ కర్మ యోగం' గీతలో చెప్పబడిందే. కాని వేదాంతులు ఐహికమునందు విరక్తులు. ఈ విరక్తియొక్క అసలు స్వరూపం రాగ ద్వేషాలను త్యజించడం. వేదాంతులు రాగాన్ని త్యజించి ద్వేషం ఉంచుకున్నారు. దానికి పూర్తి వ్యతిరేకంగా టాగూరు ద్వేషాన్ని వదలి రాగాన్ని ఉంచుకున్నాడు. ఒక విధంగా ఈ రెండూ సాధనలో లోపభూయిష్టాలే యేమో. ఈ మార్గం ఆనాడు వంగదేశంలో చాల ప్రచారంలో ఉన్న బ్రహ్మసమాజంవల్ల వచ్చివుండవచ్చు. టాగూరు తండ్రి ఈ సామాజికుడే. వంగ మేధావి వర్గాన్ని చాలావరకు ప్రభావితంచేసింది బ్రహ్మ సమాజం. ఈశ్వరుడికి ఆకారం యివ్వకపోవడం వీళ్ల ప్రభావం, మధురభక్తి వైష్ణవులదీ.

ఇదంతా దాదాపు మధురభక్తి మార్గానికి చెందిన ఉపాసనా పద్ధతి. ఒక మూర్తి కల్పనమాత్రం లేదు. ఈ మూర్తి కల్పన ఉన్న చోట ఈ 'రాగం' ఆమూర్తికి చెందేది. ఆ మూర్తి లేకపోవడంవల్ల ఈ అనురాగం లోకమునందు పరమేశ్వర బుద్ధ్యా కలుగుతున్నది. కాని లోకమునందు పెంచుకుంటున్న ఈ రాగమునందు సర్వదా పరమేశ్వర బుద్ధి ఉంటుందా అనేది ప్రశ్న. ఎలాగైతే వేదాంతులు పెంచుకున్న లోకమందలి మిధ్యాభావం లోక ప్రవృత్తిలో స్థిరంగా నిలవడం సాధ్యం కాదో, యిదీ సాధ్యంకాదు. ఈ రాగం ఈశ్వరుని ఏ ప్రతీకనో ఆశ్రయించితే దాన్ని తరువాత తరువాత మూర్తితో పాటు తొలగించుకోవడం అంత కష్టమైన సాధనా పథం కాదు.

సర్వరచనా విశిష్టాద్వైతాన్ని ఆశ్రయించి ఉన్నప్పుడు అక్కడక్కడా అద్వైతంగా భాసించే వాక్యాలుకూడా ఈ తాత్త్వికధారలోనే అంతర్భూతములవుతవి. అనుస్యూతంగా వచ్చే భావధారకు అనుగుణంగానే యీక్వాచిత్సందర్భాలుకూడా వ్యాఖ్యానము చేసుకోవాలి.

ఇక రసము నాశ్రయించిన ప్రశ్న. ఈ విషయములో రససిద్ధాంతమును పూర్తిగా అనుసరించితే దీనికి కావ్యత్వం పట్టనిమాట నిజమే. రసాభాసమూ, భావ, భావాభాసలకూ రసములో కొంత స్థానముంది కాబట్టి యిందునవుండే భావముల రమణీయత ఆధారంగా దీనికి 'భావకావ్య' సిద్ధి కలుగుతుంది. ఈ భావ కావ్యాన్ని రససిద్ధమయిన మహాకావ్యంతో సమానం అనలేము. గీతాంజలినిగూర్చిన పూర్వపక్షాలను స్పృశించి వదలివేస్తున్నాను. ఇవన్నీ తమను తాము వంచించుకోకుండా సాహిత్యపరులు ఆలోచించవలసినవి.

ఈ వివాదాలు ఎలావున్నా ఆధునిక భారతీయ చరిత్రలో చాలా ఉజ్జ్వలమైన స్థానం టాగూరుకు ఉన్నది. గాంధీ, అరవిందుడు మొదలైన మహాపురుషులతో సాటియైనవాడు. భారతీయుల ఊహామారాన్ని ప్రాచ్యదిశకు మళ్లించిన మహనీయుడు. "గీతాంజలి"

ప్రపంచంలో భారత సాహిత్యానికి గౌరవం చేకూర్చిన గ్రంథం.

దీన్ని 'చలం'గారు అనువదించారు కొత్తగా. శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు పూర్వం అనువదించారు. మరి కొందరు అనువదించారు. ఈ మధ్య కూడా అనువాదం సాగుతున్నది. ఇంతేకాక శ్రీ వెంకటపార్వతీశ్వరులు, శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, శ్రీ రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులు టాగూరు ప్రభావం విపరీతంగాపడ్డ రచయితలు. టాగూరుతరువాత భారతీయ భాషల్లోవచ్చిన ఏ గొప్ప కవిమీదనైనా కొంచెమో, గొప్పో ఆయన ప్రభావం గోచరించుతుంది.

తన జీవితంలో 'ఈశ్వరుడు' లేని రోజుల్లో కూడా పారాయణ గ్రంథమైన ఈ గీతాంజలిని అనువదించారు. ఈ అనువాదం అందుకే చాలా గొప్పగా ఉన్నది. రచనలో ఏమాత్రమూ ఎగుడుదిగుళ్లు లేవు. 'చలం' రచనల్లో సహజమైన ఆవేశమూ, తీవ్రతా, వేగమూ, బలమూ దీనిలోలేవు. ఎంతో నిగ్రహంగా రచన సాగించారు. ఈ రచనమూలంలో ఉన్నంత నెమ్మదిగా సాధువుగా ఉన్నది. 'భగవాన్ పాదాల ముందు'వంటి రచనలోకూడా ఇంత నిగ్రహం ప్రదర్శితం కాలేదు. రచనఅంతా అనువాద మనిపించకుండా ఉన్నది. తెలుగుభాష చాలా చక్కగా వున్నది. చలం భాషలో వుండే విశృంఖల ప్రయోగం చాల తక్కువ. పరిత్యాడ పరిత్యజులు 55 పే॥ (దరిద్రాది దరిద్రులన్నట్టు); మూలస్థానం - 59 పే॥ (మూలలో స్థానం అనడానికి); (తేజాష్ణవం తేజోష్ణవం అనడానికి) ఇలాంటి ప్రయోగాలు కొంచెం లేకపోలేదు. వాయిద్య, చిహ్నాను మొదలైన శబ్దరూపాలూ గోచరిస్తున్నవి. వర్షధురియాలు మొదలైన విషమ సమాసాలున్నవి.

భావాన్ని అనుసరించి భాషకూడా పెరుగుతుంది. అందుకే చలం యీ గ్రంథములో అక్కడక్కడా సమాసాలు వాడక తప్పలేదు. వికసితబాధాశోణపద్మం (96 పే॥) తుషారస్నాత ప్రభాతస్వప్నం (97 పే॥) రూపపారావార అగాధం (127 పే॥) మొదలైనవి ఎన్నో చూపవచ్చు. వీటిల్లో కొన్నింటి సంయోజన రమ్యంగా లేదు.

ఎంత జాగ్రత్తగా అనువాదం చేయబడిందంటే ఎంత స్వేచ్ఛానువాదంగా యీ రచన కనబడ్డా ఎక్కడా మూలానికి మేరదప్పలేదు.

"మబ్బులమీద మబ్బులు కమ్ముకువొస్తున్నాయి చీకటి పడుతోంది. ప్రియా! నన్నొంటరిగా యీ తలుపుదగ్గిర నీకై నిరీక్షణలో ఎందుకిట్లా వొదిలేశావు?"

మధ్యాహ్నపు కార్యకలాపంలో గుంపులోకలసి పనిచేశాను. కాని వొంటరి చీకటిరోజున నీ కోసం మాత్రమే ఆశపడతాను.

నువ్వు నీముఖం కనబరచకపోతే నన్నింత యెడం చేసి వొదిలేస్తే యీ దీర్ఘవర్షఘడియల్ని ఎట్లా గడపగలనో తెలీదు.

ఆకాశంలోని దూరపు మబ్బులవంక చూస్తో కూచున్నాను. నా హృదయం శాంతినెరుగని యీదురుగాలిలోకలసి ఏడుస్తో అటూఇటూ తిరుగుతోంది, 18 వ ఖండము.

దీన్ని మూలంతో పోల్చి చూడటంతే అనువాదం ఎంత స్వచ్ఛంగా చేయబడిందో తెలుస్తుంది. యీ విధంగా ఏ ఖండాన్నైనా పోల్చి చూచుకోవచ్చు.

— సుప్రసన్న.

---

18 వ పేజీ తరువాయి.

"అవుతాను. ఏంచేస్తే, నావాళ్లు, నా జ్ఞాతులు సుఖపడతారో, అది చేస్తాను. నీకు నా కన్యకా సహస్రంతో సహా నేను దాసి నవుతాను. నీవెంట దాసిగా, ఎక్కడికైనా సరే, వస్తాను" అంది శర్మిష్ఠ.

శర్మిష్ఠ దాసీత్వాన్ని అంగీకరించి ఒకటికి రెండుసార్లు చెప్పాక, దేవయాని తండ్రితో అంది— "నాన్నా! ఊళ్లోకి వెళదాం. నా మనస్సు ఇప్పుడు చల్లపడ్డది. నాన్నా! నీ విజ్ఞానం, నీ విద్యా బలం అమోఘం" అంది.

అప్పుడు ఆ పాడు నూతి దగ్గరినుంచి దేవయాని, శుక్రాచార్యులు, శర్మిష్ఠా, శర్మిష్ఠ వెయ్యి మంది దాసీలు, వృషపర్వుడూ ఊళ్లోకి వెళ్లారు.




అతి సరళమైన తూకాలు, కొలతల పద్ధతి దేశమంతటా ప్రవేశపెట్టే యత్నం మరికొంత ముందుకు సాగింది.

రాష్ట్రాలలోను, కేంద్ర పాలిత ప్రాంతాలలోను ఎన్నిక కొన్ని ప్రదేశాలలో 1958 అక్టోబరు 1వ తేదీ నుండి మెట్రిక్ పద్ధతి తూకాలు ఉపయోగించబడుతున్నాయి. ఈ ప్రదేశాలలో వచ్చే అక్టోబరు నెలనుండి మెట్రిక్ తూకాలు మాత్రమే వాడుతారు.

1960 ఏప్రిలు నెలనుండి ఒక్క జమ్మూ - కాశ్మీరుతో తప్ప, అన్ని రాష్ట్రాలలోనూ మెట్రిక్ తూకాల వాడకం ప్రవేశపెట్టారు.

1962 ఏప్రిలు నాటికల్లా దేశమంతటా మెట్రిక్ తూకాలు వాడటం నిర్బంధమవుతుంది.



## మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి - ఎంతో సులభమైనది

భారత ప్రభుత్వం వారిచే జారీ చేయబడినది

DA 60/66

ఉస్మానాపురా, కరీంనగరమునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము.
ముద్రణ: ఆంధ్ర ప్రింటింగ్ వర్క్స్. వరంగల్.